# 1

# చిత్రకేతు కథ

**చి**త్రకేతువు శూరసేన దేశమునకు గొప్ప ప్రతాపవంతుడగు రాజు. శూరసేన మనగా 'వెలుగు' కిరణములే కూటమిగా గల ప్రదేశము. యమునా తీరమున నేడు శివక్షేత్రముగా పేరుగాంచిన 'వటేశ్వరము' పుణ్యక్షేత్రము చుట్టునూ వున్న ప్రాంతమే శూరసేనము. చిత్రకేతువు కాలమున శూరసేనము కామధేనువు వలె ప్రజలను సంరక్షించు కొనెడిది. **పృథ్వి ఎల్లప్పుడునూ రాజునుబట్టి విలువ కలిగిన సంపదలను వెలువరచును.** సత్పురుషుడు రాజైనచో సమస్తమైన సంపదలను, ఆనందముతో దూడకు ఆవు పాలు యిచ్చునట్లు అందించును. **పాలకుడు సంస్కారహీనుడు, స్వార్థపూరితుడు అయినప్పుడు సంపదలను తనలోనికి యిముడ్చుకొనును.** ధర్మాత్ముడగు రాజు పరిపాలించినచో దున్నబడకయే పంట నిచ్చును. అచ్చటచ్చట రత్నములు, ముత్యములు కూడా త్రవ్వకయే దొరుకుచుండును.

చిత్రకేతువు చక్కటి రూపవంతుడు, సుందరమైన శరీరము గలవాడు, మిక్కిలి ఉదారుడు. అతని వద్దకు వచ్చినవాడు ఆశాభంగము

పొందినది లేదు. సమస్త విద్యల యందును పారంగతుడు. అతడు మంచి కులమున జన్మించిన రాజకుమారిని వివాహమాడెను. వీర్యవంతుడైననూ సంతానవంతుడు కాలేదు. మరల పెండ్లి చేసికొనెను. ఆమె నుండి కూడా సంతానము పొందలేదు. మరల మరల వివాహము ఆడినప్పటికీ అతనికి ఏ రాణి నుండియు సంతానము కలుగలేదు. పురోహితుల సలహా మేరకు సమస్త దానము లొనర్చెను. వ్రతము లొనర్చెను. ఉపవాసదీక్ష కూడ చేపట్టెను. అయిననూ సంతానము బడయలేదు. అది కారణముగా చిత్రకేతువు మనస్సు కలత చెందినది.

సంతతి లేక దుఃఖితుడైన చిత్రకేతువు మహారాజు నగరమునకు తేజస్వి అయిన 'అంగిరస' మహాముని వచ్చెను. ఆ మహామునికి మహారాజు సమస్త సత్కారములు చేసెను. ప్రపంచములో దుర్లభమైన వస్తువులను పొందుట సులువే కానీ, సత్పురుషుని సమాగమము అతి దుర్లభము. అది కేవలము భగవదనుగ్రహముగా కలుగుచుండును. **సత్పురుషుల కృపను పొందినవారు లోకమున ధన్యులు.** సాధుసంగమము పూర్వజన్మలో చేసిన విశేష పుణ్యము వలన ప్రాప్తించును. ఏ గృహమునకు తరచు సాధువులు వత్తురో, ఏ ఇంటిలో మహాత్ముల పాదములు కడిగిన జలములు పడినవో, అట్టి గృహమున నివసించువారి జీవితము భగవదనుగ్రహముగా, బహు ముఖములుగా వికాసము చెందును. సాధుజనులు అందరి ఇండ్లకు

పోరు. వారు కేవలము పాదము పెట్టుట చేత ఆ గృహము, గృహస్థులు కూడా పావన మగుదురు.

తెలిసినవారు, సాధుసేవను భగవత్సేవ కంటె కూడా ఉత్తమమైనదిగా మన్నింతురు. భగవంతుని అర్చించినచో, అర్చన కేవలము భగవంతునికే జరుగును. కానీ భగవద్భక్తుని అర్చించినచో, భగవంతుని సేవయు, భక్తుని సేవయూ కూడా ఏక కాలమున జరుగును. భగవంతుడు కూడా భక్తులకు జరిగే సేవకు ఎక్కువ సంతోషించును.

**సాధువులు అడుగిడుటయే కాక, విశేషించి నివసించిన గృహము గృహముగా కాక, తీర్థ స్వరూపమును పొందును.** వారు విశ్రాంతి గొనిన చోటు, భగవంతుని ఆరాధించిన చోటు, భోజనము చేసినటువంటి చోటు, ప్రవచన మొనర్చిన చోటు దివ్యములై గృహమునకు వచ్చిన వారికి స్ఫూర్తి నిచ్చును. వేయేల! సాధువులు పృథ్విని ఈ విధముగా పావన మొనర్చుచుందురు. గోవులు, సాధువులు, సతులు ఈ భూమిని ధరించి యున్నారు. వారు లేని భూమి నిరర్థక మగును.

చిత్రకేతువు మహారాజు అంగిరస మునిని మిక్కిలి శ్రద్ధతో సత్కరించెను. పురోహిత సమేతముగా పూజించెను. ప్రసన్నుడైన ముని, రాజును కూర్చుండ నియమించెను. రాజు ముని పాదముల వద్ద చాపమీద చేతులు జోడించుకొని కూర్చొనెను. అప్పుడు అంగిరసుడు రాజును కుశలప్రశ్నలు వేసెను.

"రాజా! నీ రాజ్యమున అందరును సుఖముగా నున్నారా? రాజు ఒక బ్రహ్మాండము వంటివాడు. బ్రహ్మాండము ఏడు ఆవరణములచే చుట్టుకొని యుండును. అవి వరుసగా పృథ్వి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహతత్త్వము అనునవి. అట్లే రాజుకు కూడ ఏడు ఆవరణములు కలవు. అవి వరుసగా గురువు, మంత్రులు, మిత్రులు, దండనాథులు, కోశాగారము, కోట, జనులు. రాజు ఈ ఏడింటి యందు ఏ ఒక్కటి లేకపోయిననూ బలహీనుడగును. నీవు యీ ఏడు ఆవరణలు కలిగి సుఖముగా నున్నావు కదా?" అని అంగిరసముని రాజుయొక్క కుశల మడిగెను.

రాజు చేతులు జోడించి ఇట్లనెను : "మహాత్మా! మీ కృప వలన నా సప్త ఆవరణములు కుశలమే." అది విని అంగిరసుడు ఇట్లనెను : "సప్తావరణములు నీకు సుఖము లైనప్పుడు, నీకే చింతయూ వుండరాదు. కానీ, నిన్ను చూడగా, ముఖమునందు ప్రసన్నత గోచరించుట లేదు. తీవ్రమైన ఆవేదన స్పష్టముగా కనబడుచున్నది. అందుచే నిన్ను మరియొక ప్రశ్న అడిగెదను. నీ రాణులు నీకు అనుకూలముగనే మెసలుచున్నారా? నీ ప్రజలు సంతోషముగా నున్నారా? నీ మంత్రులు వ్యవహారములందు చక్కగా వారి విధులను నిర్వర్తించుచున్నారా? నీ దండనాథులు ప్రజలను దోచుకొనుట లేదుకదా? వ్యాపారులు మోసము చేయుట లేదుకదా? గుప్తచారులు ఎప్పటికప్పుడు గూఢ విషయములను సకాలమున

అందించుచున్నారా? తోటి రాజులు నీ యెడల సహజ స్నేహము కలిగియున్నారా? నీ కుమారులు నీ ఆజ్ఞలను పాలించుచున్నారా?" అని అంగిరసుడు ప్రశ్నించెను.

దానికి చిత్రకేతువు ఈ విధముగా సమాధానము చెప్పినాడు. "స్వామీ! తాము సర్వజ్ఞులు, అయిననూ సామాన్యుని వలె ఏమియూ ఎరుగనట్లు నన్ను ప్రశ్నించుచున్నారు. తపః ప్రభావముచే, లోపల, బయట మీ రెరుగని విషయములు లేవు. అయిననూ, మీరు నా మానసిక వ్యధను గూర్చి కారణ మడుగుచున్నారు. నా నోట చెప్పించవలెనని మీ సంకల్పమై వుండవచ్చును. మీ ప్రశ్నను ఆజ్ఞగా భావించి నా మనః క్లేశమునకు కారణము వివరించుచున్నాను. నా వద్ద సమస్త భోగములు, సంపదలు చేరినవి. నా భార్యలు, మంత్రులు, మిత్రులు ఆదిగా గల వారందరూ నా యందు సుముఖులు. కాని పుత్రుడు లేక యీ సమస్తము వ్యర్థమే. ఆనందము గొల్పు సమస్త విషయములు పుత్రలేమి కారణముగా విషతుల్యములుగా నాకు తోచుచున్నవి. నా పై మీకు కృప కలిగినచో, నన్ను మీ భృత్యునిగా అంగీకరించి, కనీసము ఒక పుత్రుని నైనను ఒసంగి అనుగ్రహింపు"డని పాదములపై పడెను.

2

........................................................................................

# సాధుమహిమ

దైవ యోగమున అంగిరసముని చిత్రకేతు మహారాజు నివాసమునకు ఏతెంచెను. సామాన్యముగ స్వార్థుల ఇళ్ళకు స్వార్థులే పోవుచుందురు. ఎవరితో తమకు పనిగలదో వారి ఇండ్లకు సదా పోవుట కద్దు. కాని పుణ్యాత్ముని గృహమునకు నిజమగు సాధు పుంగవులు దయచేయుచుందురు. గృహస్థుని సేవలను పొంది, వారిని కృతార్థులను చేయుచుందురు. సత్పురుషుల పాదస్పర్శ వలన గృహస్థుల గృహములు పావనము లగును. పాతకములు దూరమగును. సత్పురుషాగమనము వ్యర్థము కాదు. వారు అపకార మొనర్చు వారిపైన కూడా కృపచూతురు. ద్వేషించువారిని కూడ ప్రేమింతురు. నిందించు వారిని సైతము ఆదరింతురు. అర్హతను బట్టి పరమార్థమునకు దారి చూపుదురు. అర్థార్థికి అర్థము నొసగి తద్వారమున క్రమశః వైరాగ్యము కలిగింతురు. ఎవరేమి కోరినను వారి కోరికల ద్వారముననే వారి నుద్ధరింప జూతురు. వారి వలన ఎవరికిని అహితము గాని, అరిష్టము గాని జరుగదు. సత్పురుషుల ప్రతి అణువును పరోపకారము

కొఱకే. వారి ప్రతి శ్వాసయందు భగవన్నామ ఉచ్చారణ జరుగుచుండును. పరహిత కార్యములను సదా నిర్వహించుట చేతనే వారు సాధువు లనబడుచున్నారు.

అట్టి సాధుపుంగవుని చిత్రకేతు మహారాజు పుత్రార్థియై ప్రార్థించెను. అంగిరసుడిట్లు పలికెను : "మహారాజా! ప్రపంచమున అన్ని వస్తువులును అదృష్టవశముననే ప్రాప్తము లగును. నీ అదృష్టమున పుత్రసుఖ మున్నట్లు తోచదు. ఇందరు రాణులుండియు పుత్రులు లేరనిన ఇంకేమన వలయును? నీవు పుత్ర మోహమును వీడి ప్రాప్తించిన దానికి తృప్తిపడి భగవదర్పితముగ జీవితమును నిర్వర్తించుకొనుము. లేనిదానికై ప్రాకులాడక ఉన్నదానిని భగవదను గ్రహముగ అనుభవింపుము. అదృష్టమున లేని కోరికను ప్రాప్తించు కొనుటకు ప్రయత్నించి దుఃఖ పడకుము. ఉండుట, లేకుండుట అనునవి రెండును భగవదనుగ్రహమే అని గుర్తింపుము. కాదని పుత్ర సంతతిని ఏదైన ఉపాయము చేత పొందినను, అట్టి పుత్రుని వలన సుఖముండక పోవచ్చును. దుఃఖము వాటిల్ల వచ్చును. పుత్రలేమి దుఃఖముకన్న, పుత్రుల వలన కలుగు దుఃఖము దుర్భరము. కావున పుత్రేషణము మానుము. **జీవులకు కోరుటయే తెలియును కాని, ఆ కోరికల వలన కలుగు సుఖ దుఃఖములను అవగాహన చేసుకొనలేరు.** కోరుట తెలియని జీవుడు కేవలము కర్తవ్య మాచరించి ఫలితమును దైవమునకు వదలుట తెలివి. అందులకై నీకిట్లు బోధించు చున్నాను."

ముని బోధన మహారాజు చెవులకు సంతోషము కలిగించలేదు. అతని మనస్సు పుత్ర మోహమున లగ్నమై యున్నది. అతడు నమస్కరించుచూ అంగిరస మహామునితో ఇట్లనెను.

"మహాత్మా! నా మనస్సు వికలమై యున్నది. నాకేమియును తోచుట లేదు. పుత్రు డుదయింపక నాకు మనశ్శాంతి లేదు. శాంతి లేని మనస్సు భగవంతుని యందు నిలువదు. ఏ విధముగనైన నాకు పుత్రు నొసంగుడు. నా అదృష్టమున పుత్రులు లేరని తెలిపితిరి. కాని మహాత్ములు ప్రారబ్ధమును కూడ మార్పు చేయగల సమర్థులని విని యుంటిని. మీరు సాక్షాత్ భగవత్ స్వరూపులు. మీ అనుగ్రహమున్నచో నేను పుత్రుని బడయగలను. సాధువుల సామర్థ్యము విధి లేఖనమును తుడిచిపెట్ట గలదు. అదృష్టమును మార్చగలదు. ఈ విషయము నేను సాధువుల వలననే వినియుంటిని. మీ అనుజ్ఞ అయినచో ఆ కథను నుడివెదను."

అంగిరస మహాముని రాజు పరిస్థితిని గమనించి మందహాసముతో యిట్లనెను : "మహారాజా! సాధువుల నోట విన్న కథను నాకు వినిపింతు నంటివి. ప్రపంచములో వినదగినవి రెండే. అవి (1) హరి చరిత్రము, (2) హరిదాసుల చరిత్రము. హరిదాసుల కథ 'హరి' కథవలె అమితానందమును గూర్చును. కావున తప్పక వినిపింప వలయును. సావధానచిత్తుడనై వినగలను."

## శ్రేష్ఠి కథ :

చిత్రకేతు మహారాజు ఇట్లనెను : “మునివర్యా! ఒకానొక కాలమున ఒక ధనిక శ్రేష్ఠు డుండెను. అత దత్యంత ధనవంతుడు. అతనికి వ్యాపారము అధిక లాభము కల్గించుచుండెడిది.

ఇంటియందు సమస్త సుఖములు కలవు. భార్య ధర్మ పరాయణ. భర్తను ప్రాణాధికముగ ప్రేమించుచుండెడిది. వారిరువురును సాధు, సజ్జన సత్కారముల నొనర్చు చుండెడివారు. వారికి సంతానము లేదు. ఆ విషయమున సదా చింతించు చుండెడివారు. ఒకరోజున దైవ యోగమున నారద మహర్షి వారింటి కేతెంచెను. భార్యాభర్త లిరువురును ఆనంద భరితులై దేవర్షికి షోడశోపచార పూజలు గావించిరి. పుణ్యదంపతి పూజలకు సంతసిల్లి నారద మహర్షి వారి కుశల మడిగెను. తమ కుశలమును తెలిపి శ్రేష్ఠి మహర్షితో నిట్లనెను. “మహర్షీ! తా మిప్పుడెచ్చట నుండి వచ్చుచున్నారు? ఎచ్చటి కేగుచున్నారు?” నారదు డిట్లనెను. “శ్రేష్ఠీ! భూలోకమున ఋషులు సత్రయాగమొకటి చేయుచుండ అందు పాల్గొనుటకై వెళ్ళితిని. తిరిగి ఇపుడు విష్ణుదర్శనము చేయుటకు పోవుచున్నాను.” శ్రేష్ఠి వినయముతో ఇట్లనెను : “మునివర్యా! మీరు నిత్యము భగవంతుని కడకు పోవుచుందురు. జీవుల కడకు వచ్చుచుందురు. పరోపకారమే మీ వ్రతము. నాకు ఒక ఉపకారము చేసిపెట్టగలరా?” అని వేడెను. ముని అట్లే అనెను. “కార్యమేమియో తెలుప” మనెను. శ్రేష్ఠి యిట్లనెను.

"స్వామీ! మాకు ఒక చింత పట్టుకొని యున్నది. మా దగ్గర సమస్తము కలదు. కాని ఈ సంపదను భవిష్యత్తున అనుభవించు వాడును, పితరులకు తర్పణము లిచ్చువాడును అగు పుత్రుడు మాత్రము లేడు. నా అదృష్టమున పుత్రుడు కలడో, లేడో ఎరుగ కోరుచున్నాను. ఉన్నచో సంతోషము. లేనిచో మనస్సు నిశ్చల మొనర్చుకొని శేష జీవితమును, సంపదను సాధుసేవకు వినియో గించెదను. భగవంతుని ఈ విషయ మడిగి నాకు తెలుపవలెనని ప్రార్థన."

నారదు డట్లే అనెను. ఆ దినముననే భగవంతుని కడకేగి సమాధానము తెత్తునని పలికెను. భగవానుని సాన్నిధ్యమున సంకల్ప మాత్రమున నిలబడెను. శ్రేష్ఠి పరిస్థితిని వివరించెను. భగవానుని సమాధానము కోరెను. భగవంతు డిట్లు పలికెను. "నారదా! ఆ శ్రేష్ఠి నొసట ఏడు జన్మల వఱకును సంతానము లేదు" అని తెలిపెను. నారదుడు ఆ విషయమును మనుష్య లోకమునకు వచ్చి శ్రేష్ఠికి తెలిపెను. శ్రేష్ఠి యిట్లనెను : "మంచిదైనది. విషయము తెలిసినది. ఇప్పుడు చింతలేదు. ఇక ఈ ధనమును మేము ఇరువురము సదుపయోగము గావించెదము. సాధుజనుల సేవకును, పరోప కారమునకును, ధనమును వినియోగించెదము."

శ్రేష్ఠిదంపతి సంపదను సద్వినియోగ మొనర్ప నారంభించిరి. అన్నదానములు చేసిరి. వస్త్ర దానములు చేసిరి. విద్యాలయముల

నేర్పరచిరి. వైద్యాలయముల నేర్పరచిరి. పేదలకు భూదానము చేసిరి. గృహనిర్మాణము చేసిరి. తటాకములను త్రవ్వించిరి. పరహితమునకై జీవితమును సమర్పణము చేసుకొనిరి. శ్రద్ధాభక్తులు కలిగి భగవదారాధనగా సమస్త కార్యము లొనర్చు చుండిరి.

**అవధూతాగమనము :**

ఇట్లుండ ఒక శుభ దినమున వారి గృహమునకు ఒక విరక్తుడగు అవధూత ఏతెంచెను. అతడున్మత్త వేషధారియై యుండెను. కౌపీనము మాత్రమే ధరించి యుండెను. అతని జడలు పాదముల వఱకు వ్రేలాడుచుండెను. బాహువులు మోకాళ్ళ వఱకు పొడవుగ వుండెను. కన్నులు మిరుమిట్లు గొలుపుచున్నవి. పెదవులు కృష్ణ కీర్తన మొనర్చుచున్నట్లుగా గోచరించుచుండెను.

శ్రేష్ఠిదంపతి అవధూతను భక్తిశ్రద్ధలతో పూజించిరి. దంపతి సేవకు సంతుష్టుడై అవధూత సంతాన విషయమును ప్రశ్నించెను. దానికి శ్రేష్ఠి భార్య మిక్కిలి దుఃఖముతో తమకా భాగ్యము లేదనియు, దేవర్షియగు నారదుడు ఈ విషయమును విధి లిఖితమని తెలిపె ననియు, అందుచే సంతాన ఆశను వదలుకొని లోకహిత కార్యములకు జీవితములను సమర్పించుకొంటి మనియు విన్నవించెను. అది విని, అవధూత "మీ కేడుగురు కొడుకులు పుట్టగలరు" అని ఆశీర్వదించి వెడలిపోయెను. శ్రేష్ఠిదంపతి దిగ్భ్రాంతి చెందెను. మహాత్ముని వాక్యానుసారముగా సంవత్సరమునకొక పుత్రుని కనుచు, ఏడు

సంవత్సరములలో సుందరులు, సుకుమారులు, శీల సద్గుణ సంపన్నులు అగు ఏడుగురు బాలకులను పొందిరి. కొంత కాలమునకు నారద మహర్షి తన పర్యాటనమున శ్రేష్ఠి గృహమున కేతెంచెను. దంపతితో పాటు పిల్ల లందరును వచ్చి ముని చరణములకు నమస్కరించిరి. పిల్లలను చూచి నారదు డాశ్చర్యపడెను. ఎవరి పిల్లలని ప్రశ్నించెను. శ్రేష్ఠి చేతులు జోడించి “స్వామీ! భగవదనుగ్రహమున ఈ ఏడుగురు పుత్రులు నాకు కలిగిరి. మీబోటి సాధువుల ఆశీర్వచన ఫలితము వీరు. వీరును సాధుసేవకు లగునట్లు ఆశీర్వదింపుడు” అని వేడెను. నారదముని కాశ్చర్యము కలిగెను. తాను స్వయముగ భగవానుని సంప్రదించి ఈ శ్రేష్ఠికి ఏడు జన్మల వఱకు సంతానము లేదని తెలిపియున్నాడు. ఇప్పుడితనికి ఈ జన్మముననే ఏడుగురు కుమారులు కలిగిరి. ఇది ఏమి విచిత్రము? భగవత్ వాక్యము ఎట్లు వమ్మైనది? ఈ విషయమును భగవానునినే అడుగవలెనని హుటాహుటిని వైకుంఠము చేరినాడు.

**నారదుని రోషము :**

రోష స్వరమున నారదుడు భగవంతు నుద్దేశించి ఇట్లు పలికెను, “స్వామీ! నేను నీ భక్తుడను. నేడు మీ వలన నేను అపహాస్యము పాలైతిని” అని, ఆ శ్రేష్ఠి విషయమున జరిగిన దంతయు వివరించెను. దానికి భగవానుడు నవ్వుచూ “నారదా! నేను ప్రస్తుతము అస్వస్థుడను. ఎవరైన సద్భక్తుడు తన హృదయమును

నా కర్పించినచో శాంతి కలుగును. శాంతి లభించిన పిదప, నీ ప్రశ్నకు సమాధాన మిత్తును. నాకు సహాయపడ దలచితివేని, సద్భక్తుల హృదయము వెదకి నా కర్పింపు" మనెను. నారదుడు మూడు లోకముల యందు సద్భక్తులను గాలించుచు, వారికి భగవానుని వేదనను విన్నవించుచూ వారి హృదయములను భగవంతుని కర్పించుటకై తన కిమ్మని వేడెను. ఎవరునూ సిద్ధపడలేదు. నారదు డపుడు దుఃఖితుడై భగవానుని చేరి "స్వామీ! ఎవ్వరునూ తమ హృదయము నిచ్చుటకు సిద్ధపడుట లేదు. ఇప్పుడు నేనేమి చేయవలెను?" అని పలికెను. దానికి భగవంతుడు ఇట్లు పలికెను. "నారదా! వింధ్యాచలారణ్యమున నర్మదానదీ పుణ్య తీరమునందు నాకు తెలిసిన ఒక అవధూత కలడు. అతని కడకు పోయిన పని కావచ్చును." అని తెలిపెను. నారదుడు ఉత్సాహముతో నర్మదా తీరమునకు పోయెను. అచట ఒక అవధూత రాతిబండను దిండుగా పెట్టుకొని ఆనందముతో శయనించి యుండెను. కౌపీనమును మాత్రము ధరించి యుండెను. నిరంతరము అతని శ్వాస భగవన్నామ స్మరణ చేయుచున్నట్లుగ గోచరించెను. ఫాలభాగము దివ్యకాంతులు వెదజల్లుచున్నట్లుగ తేజోవంతమై వుండెను. నారదుని చూచి లేచి నమస్కరించి "మహర్షీ! తమ ఈ దర్శనము కేవలము భగవదనుగ్రహమే. మీ రాకతో ఈ దినము పర్వదినమైనది" అని పలికి నారదుడు వచ్చిన కార్యమేనని ప్రశ్నించెను. నారదుడు వివరించెను. అంత నా యవధూత తృటిలో ఒక కత్తితో తన హృదయమును పెరికి నారదుని

చేతి కందించెను. "నా శరీరము సమస్తము భగవంతునిదే, నేను భగవంతుని వాడనే. భగవంతునిది భగవంతునికి సమర్పించుటలో బాధ్యత యున్నది కావున వెంటనే ఈ హృదయమును భగవంతుని కర్పింపుము" అనుచూ శ్వాస విడచెను. నారదుడు వేగముగ వైకుంఠమునకేగి హృదయ సమర్పణ గావింపబోవ ఆ యవధూత భగవంతుని ప్రక్కన కాన్పించెను. భగవంతుడు నవ్వుచూ నారదుని ఆహ్వానించెను. నారదునితో ఇట్లు పలికెను : "నారదా! ఈతడు నా కనన్య భక్తుడు. అట్లగుటచే ఈ మహాత్ముని నోట వెడలిన వాక్యము నిర్వర్తింపబడుట నా బాధ్యత అయినది. నాకన్న నా భక్తులయందు నే నెక్కువ ప్రకాశింతును. నా వాక్యములకన్న వారి వాక్యములు నాకు శిరోధార్యములు. అది కారణముగనే శ్రేష్ఠియొక్క విధివ్రాత మారినది." నారదుడు "స్వామీ! నీవు భక్తవత్సలుడవు. నేను కూడా నీ భక్తుడనే! నా మాటను మీరేల అబద్ధము గావించితిరి?" దానికి భగవంతుడు నవ్వుచూ "నీవు ఈ అవధూత యంత భక్తుడవే అయినచో నీ హృదయమునే నాకర్పించెడి వాడవు కదా! నీ వట్లు చేయలేదు కదా! ఇతనికి తనయొక్క ప్రత్యేక అస్తిత్వము లేదు. నీకు కలదు. అందుచే నీ వాక్యము అబద్ధమైనది." అని పలికెను.

**ముని వరము :**

చిత్రకేతు మహారాజు అంగిరస మునికి ఈ కథను వివరించి యిట్లనెను : "మహాత్మా! మీరును అట్టి అనన్య భక్తుల కోవకు

చెందినవారే. నా ప్రారబ్ధమును తుడిచిపెట్టుట మీకు ఏమంత ఘనకార్యము కాదు. మీ తపః ప్రభావముతో నాకు ఒక పుత్రుని అనుగ్రహింపుడు. నేను మిమ్ము శరణు కోరుచున్నాను. ఈ సేవకుని మన్నింపుడు." అని పాదములపై పడెను. అంగిరసుడు రాజు లౌక్యమును గమనించి, అతని తీరని ఆవేదనను గుర్తించి మందస్మితము చేసి యిట్లనెను : "రాజా ! నేను అవధూత అంతటి భగవద్భక్తుడనని తలచుట లేదు. నారద మహర్షి వంటి దేవర్షినీ కాను, అయినను, నీ కోరికను నెరవేర్చెదను," అని పలికి చిత్రకేతునిచే పుత్రకామేష్ఠి యజ్ఞము చేయింప సంకల్పించెను.

చిత్రకేతు మహారాజుకు పుత్రప్రాప్తి కొఱకై అంగిరస మహాముని ఒక యజ్ఞమును ప్రారంభించెను. ఆ యజ్ఞము పరిసమాప్తి యగు సమయమున యజ్ఞశేషమగు చరువును హోమగుండము నుండి ఈవలకు తీసి ముని రాజుతో ఇట్లనెను. "రాజా ! నీ కొక్కడే పుత్రుడు కలుగగలడు. కావున ఏ రాణికి పుత్రుడు కలుగవలెనో తెలుపుము." రాజు సందిగ్ధమున పడెను. పుత్రప్రాప్తికై మిక్కుటముగ వివాహముల నాడెను. తన కెందరో రాణులు కలరు. ఒక రాణికి యజ్ఞశేష మందించిన ఇతరులు దుఃఖింపగలరు. అందుచే సమాధాన మీయ వెనుకాడు చుండెను. ఆ సమయమున పురోహితుడు పట్టపు రాణికే యజ్ఞశేషము నీయవలె ననియు, ఆమెకే ఆ అర్హత కలదనియు నిర్ణయించెను. అది కారణముగ చిత్రకేతు పట్టమహిషి అయిన

కృతద్యుతికి యజ్ఞావశిష్ట మియ్యబడినది. అంగిరస మహాముని రాజు నాశీర్వదించి సాగిపోయెను. మిగిలిన రాణులందరు నిరాశ చెందిరి. కృతద్యుతి గర్భవతి అయ్యెను. ఆమె ఒక సుందరుడు, సుకుమారుడు అగు పుత్రుని ప్రసవించెను. పుత్రుని గాంచిన తల్లిదండ్రుల ఆనందమునకు మేర లేకుండెను. రాజ్యమంతా సంబరములు చేసుకొనిరి. రాజు మిక్కుటముగ ఆవులను, ధనమును అర్థులకు దానము చేయించెను. పుత్రునిపై రాజునకు ప్రేమ దిన దిన ప్రవర్థమాన మగుచుండెను. అతడు రాజునకు బహిః ప్రాణంబుగ నిలచెను. రాజు పుత్రుని చూడక ఒక్క క్షణమైన తోచని మమకారమునకు లోనయ్యెను. పంచ వర్షములు గతించినవి.

3

# మోహము

**కృ**తద్యుతి సంతానవతి అగుటచే రాజు ఆమెను ఇతర రాణులకన్న అధికముగ అభిమానించుట, సన్మానించుట, ప్రేమించుట జరుగుచుండెను. ఇతర రాణులను దాదాపుగ మరచిపోయెను. ఇది కారణముగ మిగిలిన రాణులందరు ఏకమై కృతిద్యుతిని ద్వేషింప నారంభించిరి. ఈ ద్వేషించు విషయమున వారు ఏకమైరి. పుత్రుని విషయమున రాజంత మమకారముతో వుండుట వారు సహింప లేకపోయిరి. ఈ పుత్రుని మూలముగనే తమకింత దుర్దశ కలిగినదని భావించి కుట్రపన్ని పిల్లవానికి విషము నొసగి, వాని జీవితము నంతము గావించిరి.

జీవుడు ఎన్నో ఆశలను కల్పించుకొనుచుండును. కాని చివరకు అవి విఫల మగుచుండును. చిత్రకేతు మహారాజు అధిక ఆనందము అధిక దుఃఖముగ పరివర్తన చెందినది. రాజు శరీరమంతయు చల్లబడిపోయెను. అతడు తలగొట్టుకొనుచు విలవిల ఏడ్చుచూ అంతఃపురమునకు పరుగెత్తెను. రాణి మూర్ఛిల్లినది. రాజు రోదనము నింగి నంటినది. మిగిలిన రాణులు కపట రోదనము

చేసిరి. ఎవరు వూరడించినను రాజు దుఃఖమునుండి ఓదార్పు చెందుటలేదు. ఆ సమయమున అంగిరసముని, నారద మహర్షితో సహా మారు రూపములలో అచటి కేతెంచిరి. శోకగ్రస్తుడైన రాజును ఉద్దేశించి ఇట్లు పలికెను : "రాజా! శోకింపకుము. జీవులకు సంఘటనలు కర్మమును బట్టి ఏర్పడుచుండును. నీ వెవరికొఱకు ఇంతగా శోకించుచున్నావో అతడు వెనుకటి జన్మలలో నీకేమగును? రాబోవు జన్మలో ఏ సంబంధము లుండును? ఈ ఐదు సంవత్సరముల సంబంధము అనంత కాలములో అత్యంత స్వల్ప విషయము. ఈ పుత్రుడు నీకు కలుగకముందు నీకు మోహము లేదు. **నీ విపరీత మోహమే, విపరీత దుఃఖమునకు దారితీసినది**. అప్పుడు పుట్టినాడు, ఇప్పుడు చచ్చినాడు అనుట కేవలము నీ భ్రమ. ఈ జగత్ ప్రవాహము అనాది అయినది. ప్రవాహమున ఏర్పడు సంబంధములు తాత్కాలికములు. ప్రవాహముపై తేలు వస్తువులు తాత్కాలికముగ కలియుట, విడిపోవుట జరుగుచున్నది. కలియుట విడిపోవుటకు దారితీయుననియు, ప్రవాహముల శాశ్వత సంబంధములు వస్తువుల మధ్య వుండవనియు గుర్తుంచుకొనుట తెలియును. విడిపోవుదమని తెలిసి కూడా బంధములను పెంచుకొనుట వలన విడిపోవు సమయమున బంధములు బాధించవు. ప్రవాహమగు అంతర్యామి యొక్కటియే. అందు తేలెడి వస్తువులకు శాశ్వత సంబంధ ముండదు. కాలక్రమమున జీవులు కలియుట, వియోగము చెందుట జరుగు చుండును. **ఎవరికిని ఎవరు శాశ్వతముగ మిత్రులు కారు–**

**శత్రువులును కారు.** అంతయూ మోహమే. ఈ పలుకులు విని రాజు ప్రత్యుత్తరమేమియు ఇయ్యలేదు. రాజ పురోహితు డిట్లనెను. "స్వామీ ! శోకమును గూర్చి మరికొంత విశదముగ పలుకుడు."

**శోకము :**

చిత్రకేతు మహారాజు పురోహితుని పరిప్రశ్నములకు అంగిరస ముని ఈ విధముగ తెలిపెను. "శోకమెట్లు కలుగునని ప్రశ్నించితివి. శోకము అజ్ఞానముచే కలుగును. అసత్యమును సత్యముగ భావించుట వలన కలుగును. జీవుడు అనంత ప్రయాణమున తన తోటి జీవులతో మానసికముగ నేర్పరచుకొనిన సంబంధములు మోహమునకు, శోకమునకు దారితీయును. తీర్థయాత్రకు పోవు బృందములో ఒకరితో నొకరు సంబంధము లేర్పరచుకొనుచుందురు. కలసి నడుచు చుందురు. కలసి తినుచుందురు. దారిలో లోకాభి రామాయణముగ మాటలు చెప్పుకొనుచుందురు. అమ్మా, అన్నా, అత్తా, తాత, బాబు, ఒదినా అని సంబోధించుకొనుచు ప్రయాణము సాగింతురు. చివరికి ఎవరి దారిన వారు పోవుదురు. యాత్రలో ఏర్పరచుకొన్న సంబంధములు తాత్కాలికమే గాని, సత్యము కాదు. యాత్ర అని గుర్తుండుటచే విడిపోవునపుడు శోక మేర్పడదు. జ్ఞాని యగువాడు జీవితమును ఒక యాత్రగా తెలిసియుండును. యాత్రలో కలిసినవారి గూర్చి మోహము చెందని మిత్రత్వము లుండును. విడిపోయినపుడు శోకముండదు. ఈశ్వరాజ్ఞచే జీవులు కలియుట,

విడిపోవుట, జరుగుచున్నదని జ్ఞప్తి యున్నవానికి శోకముండదు. అతడు అన్ని కాలములయందును అంతర్యామి భావనయందు నిలచి జగన్నాటకమును దర్శించుచూ జీవించు చుండును. సమస్తమును భగవంతుని దివ్యవైభవముగ భావించు చుండును. ఈ చరాచర ప్రాణులన్నియు ఇపుడున్నట్లుగ ఇదివరకు లేవు. ఇదివరకున్నట్లుగ ఇప్పుడు లేవు. ఇప్పుడున్నట్లు ముందుండవు. ఇదంతయు ఒక గంధర్వ నగరమువంటి మిథ్యాకల్పము. ఈ మొత్తమున అంతర్యామియే సత్యము. మిథ్యా కల్పనములో బడక అంతర్యామి యందుండుట నేర్చిన జీవుడు, మోహ శోకములనుండి ముక్తుడగును."

ఆ మాటలు వినిన పురోహితుడు మరల ఇట్లు ప్రశ్నించెను.

"మునివర్యా! ఇది అంతయు లేనిదే అయినచో ప్రాణులు పుట్టుట, చచ్చుట, సృష్టి అగుట, వృద్ధి పొందుట, ప్రళయ మగుట ఇవన్నియూ ఏమి?"

## కవి హృదయము :

ముని ఇట్లు చెప్పదొడగెను. "బ్రాహ్మణోత్తమా! ఇది అంతయు పరమేశ్వరుని క్రీడ మాత్రమే. అది ఎట్లనిన ఒక కవి హృదయము నుండి ఒక చక్కనికథ వ్యక్తమైనట్లు, కథయందు పాత్రలు వ్యక్తమైనట్లు, కవి సంకల్పమున వ్యక్తమైన కథ, పాత్రలు కవిలో నుండి వచ్చి వృద్ధి చెంది కథాంతమున కవిలోనికి అదృశ్యమగును. కథకు కాని, పాత్రలకు కాని, కవితో సంబంధము లేక ప్రత్యేక అస్థిత్వము లేదు.

కథకు, పాత్రలకు కవియే ఆధారము. కథయే ఈ సృష్టిచక్రము. అందలి పాత్రలే ప్రాణులు. వీటి పుట్టుక, వృద్ధి, చావు- సృష్టిని, ప్రాణులను కవి వలె తనసుండి ఉద్భవింప చేయుచున్నవాడు పరమేశ్వరుడు. ఈ మొత్తములో ఉత్పన్నమునకు ఆధారభూతుడే నిత్యము సత్యము అయినవాడు. కథా పాత్రలు కన్న కవి సత్యమైనవాడు. ఉత్పన్నమగు కథ, పాత్రలు (సృష్టి, ప్రాణులు) తాత్కాలికములు, మిథ్యా రూపములు. అద్భుతమేమనగ కథ, కథలోని పాత్రలుగ కవియే జీవించును. కవి కథలో ఒక పాత్రగ కనుపింపడు. అట్లే దైవమును.

ఇది విని పురోహితు డిట్లనెను : “స్వామీ! ఈ విషయమును మరికొంత విశద పరచుడు.” అంగిరస ముని ఇట్లనెను : “కుండ, మూకుడు, ప్రమిద ఇవన్నియు మట్టితోనే చేయబడుచున్నవి. భిన్న భిన్నములైన ఆకృతులుగ చేయబడుచున్నవి. భిన్న భిన్న నామములు ఈ ఆకృతులకు ఆపాదింపబడు చున్నవి. ఆకృతులు, వాని నామములు తాత్కాలికములే. మట్టి యొక్కటే సత్యము. అది అన్ని కాలముల యందు వుండును. కుండకు ముందుండును. కుండ ముందుండును. కుండ పగిలినపుడు కూడ వుండును. త్రికాలముల యందు వుండును. కుండయందు కూడ మట్టిగనే యుండును. ఆకారము పొందక ముందు, పొందినప్పుడు, తరువాత కూడ మట్టిగనే యుండును. మట్టి నిత్యమైనది. సత్యమైనది. ఆకారము, నామము తాత్కాలికములు. అవి ఉత్పన్నములు. కల్పితములు. అదే విధముగ

దేహము, దేహి పరమేశ్వరుని నుండి ఉత్పన్నమైన తాత్కాలిక మిథ్యా రూపములు. సముద్రము నందలి అలలను చూడుము. అవి సముద్రము నుండి ఉత్పన్నమైనవి. తాత్కాలికముగ వచ్చి పోవు చుండును. సముద్రము నిత్యమైన అంతర్యామి ప్రజ్ఞగ భావించినచో అందేర్పడు అలలు నామరూపాత్మక జగత్తుగ భావింపవచ్చును."

అంగిరస మహామునికి, బ్రాహ్మణునికి జరుగు సంభాషణలు సమస్తము వినుచున్న చిత్రకేతు మహారాజు కొంత జ్ఞానము పొంది ఊరడిల్లెను. రాజు సహజముగ వివేకి. సత్సాంగత్యము ఒనర్చినవాడు. మహాత్ములను చిరకాలము శ్రద్ధగా సేవించినవాడు. పుత్రుని మరణము నిమిత్తముగ అతనికి మోహము కలిగెను. కాని అమృతమయములైన ముని వాక్కుల ద్వారా మరల జ్ఞానోదయమయి అది కారణముగ అతనికి సంభవించిన అసహ్య మానసిక వేదన కొంచెము తగ్గినది. అప్పుడతడు లేచి కూర్చుండెను. అతని ముఖము శోకముతో మలినముగ నుండెను. కన్నులు అశ్రుధారా పూరితములుగా నుండెను. మెల్లగ కన్నులను నలుపుకొని, కన్నీటిని తుడుచుకొనుచు ఎదురుగా నున్న మహాత్ములను గమనించి వారినేదో అడుగుటకు ఉద్యుక్తుడయ్యెను.

**సహజగుణము :**

ఎవ్వనికేది సహజ స్వభావమో అది తాత్కాలికముగ నిమిత్త కారణములచే మరుగున పడినను, అనతి కాలముననే సహజముగ తిరిగి ఏర్పడును. క్రూరుడు మంచితనమును నటించినను, అది

తాత్కాలికము. సజ్జనుడు దుష్ప్రవర్తనము చూపినను అది తాత్కాలికము. జ్ఞాని అజ్ఞానమున బడినను అది తాత్కాలికము. శోకము, మోహము వానిని తాత్కాలికముగనే పీడించును. జలము సహజముగ చల్లదనము గలది. తాత్కాలికముగ ఎండకు వేడెక్కినను త్వరితముగనే తన సహజమైన చల్లదనమును పొందును. చిత్రకేతు మహారాజు సహజముగ సాధుశీలి, సజ్జనుడు, వివేకవంతుడు. అతనికి కలిగిన మోహము, శోకము విశేష సన్నివేశముల వలన కలిగెను. అత్యంత మోహము అతని సహజ స్వభావము కాదు. మీరిన వయసులో అరుదైన అనుగ్రహము వలన సంతానమును పొందుటచే అతనిని పుత్రమోహము ఆవహించినది. స్వాభావికముగా మోహము కలిగిన వాడైనచో అట్టి మోహము ఇతర విషయముల యందు కూడా కనుపించవలెను కదా! అటులనే పుత్రుని మరణము కూడ తీవ్రమైన శోకమును కలిగించినను మరల తన సహజ స్వభావము లోనికి అతను స్థిరపడెను. **సజ్జనుల అలజడి తాత్కాలికము గాని స్వాభావికము కాదు.** శ్రీరామచంద్రుడు సైతము విశేష సన్నివేశములలో క్షణ కాలముపాటు అలజడి చెందినట్లు రామాయణము స్పష్టముగా తెలుపుచున్నది. సదా సాధుసేవలో, సత్సాంగత్యములో, సత్కర్మలో నివసించు చిత్రకేతు మహారాజు మరల కుదుటపడి అంగిరస, నారద మహర్షులను చూచి ఇట్లనుచున్నాడు. మహాత్ములారా! మీరెవరు? ఎచ్చటినుండి వచ్చినారు? ఈ సమయమున ఈ దీన హీన మలిన మతియగు పామరుని యందు మీకెట్లు కృప కలిగినది? మీ వాక్కుల

యందలి గూఢ జ్ఞానమును వినుటచే మహాఋషులని తోచుచున్నది. అంత అంగిరస ముని నవ్వుచు నిట్లనెను : "నీవు మాలో ఋషి చిహ్నములను వేనిని గాంచితివి?" రాజు ఇట్లనెను.

**ఋషి చిహ్నములు :**

చిహ్నము లేమియు లేకున్నను మీరు మాత్రము సాధారణ భిక్షువులు కారు. మీరు మీ యథార్థ స్వరూపమును దాచితిరి. ఏకనిష్ఠులు, భగవద్భక్తులు, జ్ఞానులు, సద్బ్రాహ్మణులు తమ స్వరూపమును దాచుకుని, రహస్య వేషమున ఈ భూమిపై పర్యటించుచుందురు. ఒకప్పుడు అవధూత వేషము ధరింతురు. మరొకప్పుడు పిచ్చివానివలె నటనను ప్రదర్శింతురు. కావున **రూపమున ఋషి చిహ్నములను వెదకుట కాక ప్రవర్తనమున వెదకినచో గోచరింపగలదు.** నావంటి మూఢుని సైతము అనుగ్రహించుటకు, సంసారము నుండి దాటించుటకు తమకుగ తాము దర్శనమిచ్చుదురు. కర్మబంధనములు లేక స్వేచ్ఛానుసారమున శరీరమును ధరించి తిరుగువారు ఋషులు. అజ్ఞానాంధకారమున పడియున్న పశుతుల్యుడ నగు నాకు జ్ఞానము వికసింపజేయ వచ్చితిరి. సంసార సాగరమందలి మోహన రూపమగు మొసలినోట పడబోవు అభాగ్యుడనగు నన్ను చేయి పట్టుకొని బయట పడవేయుటకు పిలువకయే విచ్చేసితిరి. నాపై దయవుంచి మీ పరిచయము నొసంగుడు. నన్నుద్ధరింపుడు. నేను మీ ఇరువురిని శరణు వేడుచున్నాను.

అంగిరస మహాముని ఇట్లనెను : "రాజా ! నీవు నన్ను మరచితివా? ఏమి? నీవు పుత్రుడు కావలెనని మిక్కిలి పట్టుపట్టగా నీ బలవంతమును చూచి నీకు పుత్రదానము గావింపవచ్చిన అంగిరసుడను. నేనే ఈ పుత్రుని ప్రసాదించితిని గదా!

రాజు సంభ్రమముతో "స్వామీ ! ఈ సమయమున నా బుద్ధి భ్రష్టమైనది. నేను సంసార మోహమున కళ్యాణప్రదమైన విషయములను మరచితిని. **సంసార జీవులకు మరపు అనునది స్వాభావికము.** మరపు నుండి మేల్కొలుపుటకు మీబోటి సాధువులే గతి. ఇంతకును ఈ రెండవ మహాపురుషు డెవరు? అని పలికెను.

అంగిరసుడు, అతడు తన సోదరుడగు నారదుడని తెలిపెను. అది వినినంతనే రాజు లేచి వారి చరణములపై పడి దుఃఖించుచూ తన్ను శోకసాగరము నుండి బైట పడవేయుడని వేడుకొనెను. అంగిరసుడు రాజున కీ విధముగ జ్ఞానోపదేశము చేసెను.

# 4

# జ్ఞానోపదేశం

"**రా**జా! నీవు భగవద్భక్తుడవు. ఈ శోకము నీ కనురూపముగ లేదు. పుత్రమోహముచే అంధకారమున బడితివి. నీవీ విధముగ ఏడ్చుటయు, నిన్ను నీవు మరచుటయు ఉచితము కాదు. ఎట్టి ఆపదలు వచ్చినను, భగవద్భక్తుడు విచలితుడు కారాదు. నీకు నే నిపుడు జ్ఞానప్రదానము కావింప వచ్చితిని."

అది విని రాజిట్లనెను.

"మహాత్మా! మీరు నాకు పూర్వముననే జ్ఞానోపదేశ మేల చేయలేదు? ప్రారబ్ధమున లేకున్నను, పుత్రప్రాప్తి కావలెనని నేను మొండిపట్టు పట్టిన సందర్భమున మీ రందించు జ్ఞానము లభించినచో ఈ దుఃఖమున పడియుండెడి వాడను కాదు కదా!"

అంగిరసుడు నవ్వి ఇట్లనెను.

"రాజా! నే నపుడు జ్ఞానోపదేశము చేయుటకే వచ్చితిని. కాని, అప్పుడు నీ చిత్తవృత్తి పుత్రప్రాప్తి యందు లగ్నమై యున్నది.

ప్రాప్తము లేదని తెలిపినను, నా యోగబలమున పుత్రుని అనుగ్రహింపుమని బలవంతము చేసితివి. నీ వపుడు జ్ఞానమున కున్ముఖముగ లేవు. ఉపదేశించినను వ్యర్థమయ్యెడిదే. జ్ఞానమును గ్రహించుటకు నువ్వు అసమర్థుడవై యున్నావు. అందువలన జ్ఞాన మొసంగకయే వెడలిపోతిని. పుత్రుని వలన సుఖించ గలనను భావము నిన్ను అప్పుడు తీవ్రముగ ఆవరించి యున్నది. ఇప్పుడు పుత్రుడు జన్మించిన కారణమున దుఃఖము ననుభవించు చున్నావు. బంధు మిత్ర పుత్రాదుల వలన దుఃఖము కూడ కలుగగలదని యిప్పుడు గ్రహించితివి. ఇపుడు నీవు జ్ఞానోపదేశమునకు అర్హతను పొందితివి. పుత్రాదుల వలన ఎన్ని కష్టము లనుభవింప వలెనో నీ కిపుడు తెలిసినది కదా! పర్వతములను దూరము నుండి గాంచినపుడు అవి నునుపుగ కనపడును. దగ్గరకు పోయి ఎక్కజూచినచో ఎగుడు దిగుడు గను, ముళ్ళ పొదలతో భయంకరముగను నుండును. పుత్రుడు పుట్టునపుడు తల్లికి కష్టము. బాలారిష్టములు పొందినపుడు తల్లిదండ్రులకు కష్టము. విద్యాబుద్ధులు నేర్పుటలో తల్లిదండ్రులకు, గురువులకు కష్టమే. అతడు అయోగ్యుడయ్యెనా, అందరికీ కష్టమగును. యోగ్యుడయ్యెనా అతని ప్రాణములను గూర్చిన భీతి కష్టమును కలిగించును. ఇట్లు పుత్రుని విషయమెట్లో శరీర విషయమునను, స్త్రీ విషయమునను, ధన విషయమునను, సమస్త సంబంధములందు కూడ అట్లే కష్టము పొంచి యుండును. **ఇవి అన్నియు సుఖమును ఎఱజూపి కష్టమున పడవేయు ఎఱలు.** ఎఱను జూచి ఆశపడి చేప

గాలమునకు చిక్కుకొని నశించుచున్నది కదా! జీవితమున తనవంతు కర్తవ్యమునందు వర్తించుచు, తనకు లభించు దానిని అనుభవించుట యోగ్యము. కోరి తీవ్రముగ ఆరాటపడి పొందు విషయము దుఃఖమునకు హేతువగును. నీవు కోరి పుత్రుని కారణముగ దుఃఖమున బడియున్నావు."

రాజు ఇట్లనెను : స్వామీ! మీరు తెలిపిన సంబంధము లన్నింటి యందును దుఃఖమున్నదని తెలిపితిరి. వీనిలో ప్రత్యక్షముగ సుఖమును కూడ పొందుచున్నాము కదా! రుచికరమైన పదార్థము లను ప్రత్యక్షముగ అనుభవించుచున్నాము. సత్సంగీతమును శ్రవణము ద్వారా, సౌందర్యమును కన్నులద్వారా, సువాసనలను నాసికద్వారా, చల్లని, వెచ్చని స్పర్శను చర్మము ద్వారా ప్రత్యక్షముగ అనుభవించు చున్నాము కదా! అన్నింటికన్న ప్రత్యక్ష ప్రమాణము గొప్పది కదా!

ముని యిట్లు పలికెను : "రాజా! నీవు ప్రత్యక్షానుభూతి అని చెప్పుచున్న అనుభవము లన్నియు ఇంద్రియముల వలన పొందినవే. ఇంద్రియాదు లన్నియు అసత్యమును సత్యముగ గోచరింప జేయును. ఆకాశమున రంగులతో కూడిన ఇంద్రధనస్సు గోచరించును. ఆ ధనస్సు సత్యమా? ఎడారిలో ఎండ వలన దూరముగ నీరున్నట్లు గోచరించును. ఆ నీరు సత్యమా? స్వప్నములో ఇంద్రియములు అనేకములైన వస్తువులను కనుపింప చేయును. అవి అన్నియూ సత్యమా? అవి సత్యములుగ కల్పింపబడి తాత్కాలిక సుఖము నిచ్చి,

తదుపరి అదృశ్యమై దుఃఖానుభవము కలుగచేయు చున్నవి. రుచి తినునపుడు సత్యముగ గోచరించి ఆపైన అస్వస్థతను దేహమున స్థిరపరచును. స్పర్శ కూడ నట్లే తాత్కాలికముగ సుఖము నిచ్చి, తదుపరి చిక్కులను కలిగించు చుండును. వేటగాని సంగీతమునకు ఆకర్షింపబడిన లేడి తన ప్రాణములను సైతము కోల్పోవుచున్నది కదా! ఇంద్రియముల ఇంద్రజాలమును గ్రహించి నిత్యానిత్యములను యెరిగి ప్రవర్తించుట ఒక్కటియే సూటియైన మార్గము. ఇంద్రియములు-ఇంద్రియార్థముల యందు పరువెత్తు సందర్భమున వివేకము నాశ్రయించి కర్తవ్యమును రుచికరముగ నిర్వర్తించినపుడు కర్మల నుండి బంధములు మొలకెత్తవు.

జీవుడు సహజముగ పంచభూతాత్మకమగు దేహము, పంచేంద్రియములు, మనస్సు అను పదకొండు ఇంద్రియములపై అధిష్ఠించి యుండు పన్నెండవ వాడు. మనస్సు, ఇంద్రియములు, శరీరము ద్వారా తన్ను తాను నిర్వర్తించుకొను చుండును. ఈ పదునొకండును జీవునిచే నిర్దేశింపబడవలెను. అట్లుగాక అవి జీవుని నిర్దేశించినచో జీవితము తికమక యగును. మనస్సు, ఇంద్రియములు, శరీరము, తన కుపకరించు పనివారు మాత్రమే. తాను యజమాని. పనివారు చెప్పినట్లు విను యజమాని నశించును. పనివారిని నిర్దేశించి వారిచే చేయించు పనులను సక్రమముగ నిర్వర్తింపచేయు యజమాని జీవితమున వైభవమును పొందును. స్వప్నము నందు కాంచిన దంతయు ఎట్లు మిథ్యయో, మనస్సు, ఇంద్రియములు, శరీరమునకు

లోబడిన జీవప్రజ్ఞకు కనిపించు సమస్తమూ మిథ్యయే. జాగ్రత్ స్వప్నముల యందు జీవుడు ఈ విధముగా స్వామిత్వమును కోల్పోవుటచే మిథ్యాజీవితమున పడుచున్నాడు. నిద్రయందు కూడ యిదియే స్థితి. నీవు సహజముగ ఆత్మవంతుడవు, ప్రజ్ఞావంతుడవు. అది కారణముగ బుద్ధిమంతుడవు. నీ యథార్థ స్వరూపమును నీవు గుర్తెరిగినచో మిథ్యా విషయము నందు బయల్పడగలవు. స్వస్వరూప చింతన మొనర్చినచో శోక మోహముల నుండి విడివడి పరమశాంతిని పొందగలవు." అని ఇట్లు అంగిరసముని చిత్రకేతు మహారాజునకు ఆత్మ, అనాత్మ వివేకము చెప్పి కొంత మౌనమును ప్రసాదించెను.

అటుపై అంగిరస మహాముని యిట్లనెను : "రాజా! **గురువు లేక ఉద్ధరణము లేదు.** నీ అదృష్టమున దేవర్షియగు నారదుడు యిచ్చట కేతెంచి యున్నాడు. నీ వీతని ఆశ్రయింపుము. ఇతనిచే మంత్రదీక్షను గొనుము. శుభశిక్షణను పొందుము. ఈతని ఉపదేశమును శిరసావహించి ఆచరింపుము. నీకు శుభము కలుగును."

## నారదుని బోధనము :

అది విని రాజు నారదు నాశ్రయించి మంత్రదీక్ష నొసంగ ప్రార్థించెను. నారదుడు తనలో యిట్లనుకొనెను. "చిత్రకేతువునకు యథార్థముగ వైరాగ్యము కలుగలేదు. పుత్రవియోగము కారణముగ అత్యంత శోక మేర్పడినది. శోకము కారణముగ వైరాగ్యము కలిగినది. శోకము తమోగుణము. కావున ఈ వైరాగ్యము తమోగుణ

ప్రధానమైనదే కాని, సత్త్వగుణ ప్రధానము కాదు. కావున ఇతనికి ఘోర తమోగుణ మయుడగు సంకర్షణుని ఉపాసనము చెప్పవలెను. అతడితనికి భక్తిముక్తుల నొసగ గలడు." ఇట్లు భావించి రాజుతో నారద మహర్షి ఇట్లనెను : "రాజా! నీకు సంకర్షణ భగవానుని మంత్రోపదేశము చేసెదను. దీనిని మనసున ధరించి ఏడు దినములు నీవు నిద్రింపక నిరంతరము జప మొనరించినచో నీ కతిశీఘ్రముగ సంకర్షణుని దర్శనము కలుగగలదు. దీని ఫల మమోఘము. దీనిచే నీకు పరమానంద ప్రాప్తి కలుగును. దీని ప్రభావముచే శోకము వలన, మోహము వలన జనించు కర్మబంధములు త్యజింపగలవు. శ్రీహరియందు ప్రతిష్ఠితుడ వయ్యెదవు."

మరియు చిత్రకేతువును మోహాశోకముల నుండి ఉద్ధరించుటకు నారద మహర్షి చనిపోయిన మహారాజు కుమారుని జీవాత్మను తన యోగశక్తిచే ప్రత్యక్షముగ పిలచెను. పిల్లవాడు బ్రతికినట్లు లేచి కూర్చుండెను. అప్పుడు నారదుడు వానితో నిట్లనెను : "ఓ జీవాత్మా! చూడుము, ఈతడు నీ తండ్రి, ఈమె నీ తల్లి, వీరు నీ సవతి తల్లులు, ఈ చుట్టును కలవారు నీ బాంధవులు. నీ కొఱకై వీరందరూ శోకమున మునిగియున్నారు. వీరియందు దయవుంచి నీ వీ శరీరము నందు ప్రవేశించి వీరి నందరిని సుఖపెట్టుము. నీ తండ్రి వృద్ధుడైనాడు. ఇతడు త్వరలోనే నీకు రాజ సింహాసనమును సమర్పింపగలడు. నీవు ఈ భూమి మొత్తమునకు సామ్రాట్టు కాగలవు. అందరును నీ ఆజ్ఞకు బద్ధులై వర్తించెదరు. నీ తల్లిదండ్రులు,

బంధువులు, మంత్రి పురోహిత భృత్యవర్గము అంతయు ఆనందించెదరు. వీరందరిని సంతోషపెట్టుము. భూమిపై చక్రవర్తిగ జీవించుట కన్న ఉత్తమమైన భోగ మేదికలదు?"

**జీవాత్మ భాషణము :**

నారద మహర్షి ఇట్లు పలుకగనే విని ఆ జీవాత్మ, బిగ్గరగా పక పక నవ్వెను. అందరు వినుచుండ ఈ విధముగ పలికెను. "స్వామీ! వీరు నా తల్లిదండ్రులని, బంధువులని ఏ కారణముచే తెల్పుచున్నారు?"

మన మెవరిని ప్రేమించుచుందుమో వారు మనలను తిరిగి అంత గాఢముగాను ప్రేమించవలెనని ఆశించు చుందుము. వారు మన ప్రేమను కాలదన్ని ఉపేక్షించినచో, ఇట్టి సమయమున ఆధ్యాత్మిక సంస్కారము కలవానికి వైరాగ్యము జనించును. మాయా మోహముల యందు పడినవాడు తిరస్కృతుడైనను, అవమానింప బడినను వైరాగ్యము పొందజాలడు. మిక్కిలి కష్టపడుచుండును. సంసార శిఖరమునుండి ఎన్నటికి బైటపడడు. దైవమే సాధు రూపమున స్వయముగ వచ్చి మార్గమును చూపుటయే అట్టి వానికి పరిష్కారము.

నారదుడు చిత్రకేతువునకు మోహము బాపుటకై ఆతని మృతపుత్రుని జీవాత్మను మృతదేహము లోనికి ఆహ్వానించెను. ఆ బాలునకు తల్లిదండ్రులను పరిచయము చేసెను. వారిని సంతోష

పెట్టమని కోరెను. దానికి జీవాత్మ ఇట్లు బదులు చెప్పెను. “స్వామీ ! కేవలము నాకు శరీరము నొసగినవారే, శరీరము వదలిన తరువాత కూడ తల్లిదండ్రులగుచో నాకు వేలమంది తల్లిదండ్రులు కలరు. ఈ సమయమున నాకు గత జన్మల స్మృతి కలుగుచున్నది. అది కారణముగ జన్మ జన్మల నుండి ఎవరెవరికి జన్మించితినో వారందరూ నా తల్లిదండ్రు లగుదురు. కొన్ని జన్మలలో తల్లిదండ్రులుగా నున్నవారు మరికొన్ని జన్మలలో నా సంతానముగ కూడ ఏర్పడినట్లు గోచరించు చున్నది. అన్ని జన్మలలోను జీవునికి ఒకే తల్లి, ఒకే తండ్రి యుండు నియమము లేదు. శత్రువు, మిత్రువు, బంధువు, సోదరులు, తల్లి, తండ్రి మారుచుందురు.”

“మారనిమ్ము, ఈ జన్మమున వీరు నీకు తల్లిదండ్రులు కదా !” అని నారదుడు పలికెను.

జీవాత్మ ఇట్లనెను, “స్వామీ! ఈ దేహమున నే నున్నప్పుడు వీరు తల్లిదండ్రులుగా నుండిరి. ఇప్పుడు నేనీ దేహబద్ధుడనై లేను. కేవలము మీ పిలుపు వలన ఇందులోనికి వచ్చియుంటిని. శరీర బంధమే లేని నాకు శరీరముతో ఏర్పడిన సంబంధ మెట్లుండగలదు? జీవుడు నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు మరియు జనన మరణ రహితుడు, స్వయం ప్రకాశకుడు, సర్వ సమర్థుడు. కాలక్రమమున దేహము విడచును. అపుడే గుణములచే పేర్చబడిన ఈ ప్రపంచమున ప్రవేశించి తిరుగుచుండును. ఇతనికి సహజముగ ప్రియా ప్రియములు, మిత్రశత్రుత్వములు లేవు. కేవలము సాక్షి. మాయ ఆవరించినపుడు

తాను కర్తనని భ్రమించి, కర్మఫలములను గ్రహించును. అప్పుడు తన నిజస్థితిని మరచును. కాలక్రమమున దేహము విడచును. అపుడీ సంబంధములను కూడ విడచును. మరల క్రొత్త బంధముల నేర్పరచుకొను చుండును."

"వీరెంతగా ఏడ్చినను, ఎంతగా మొత్తుకున్నను, నేను తిరిగిరాను. కాలగతి దుర్నివారమైనది. అది ఒక లిప్తయైనను తగ్గదు. నువ్వు గింజంతైనను పెరగదు. మీరు సర్వ సమర్థులు. మీ యోగశక్తిచే నన్ను పిలిచితిరి, ఇక నేను వెడలుటకు ఆజ్ఞ నొసగుడు."

**శరణాగతి :**

ఇట్లు పలికి ఆ జీవాత్మ వెడలిపోయెను. రాజపుత్రుని శరీరము మరల పడిపోయెను. అప్పుడు చిత్రకేతువునకు జ్ఞానము కలిగెను. తా నెవరికోస మింతగా శోకించుచున్నాడో అతడు తనను గుర్తించనైనా గుర్తించలేదు. కనీసము తనతో ఒక మాటైనను పలుకలేదు. తా నెవరో తెలియనట్లు, అపరిచితునివలె ప్రవర్తించెను. అట్టి వానియందు తనకు మోహమేల? ఇట్టి మోహమున తానెట్లు బడెను? శాశ్వతము కాని విషయములను శాశ్వతమని భ్రమించి చిక్కుబడితిని. ఇక నాకు ఈ మహర్షులే శరణ్యము అని నిశ్చయించుకొని, కంటి నీటిని తుడుచుకొని శరీరముపై ఏర్పడిన ధూళిని దులుపుకొని తల ముడి వైచుకొని శోక రహితుడై నారద మహర్షి చరణములపై బడెను. నారద మహర్షిని కర్తవ్యమును

బోధించుమని అర్థించెను. మృత దేహమునకు సంస్కారము చేయుట మొదటి కర్తవ్యమని నారదుడు తెలుపగ, మోహ రహితుడై ఆ దేహమునకు దహన సంస్కారముల నొనర్చెను.

పిల్లవానికి సంస్కారము కాగానే విష మొసంగిన రాణులకు మిక్కిలి పశ్చాత్తాపము కలిగెను. జీవాత్మ ప్రబోధము వారి నత్యంతముగ ప్రభావితము చేసెను. పట్టరాని ఈర్ష్య కారణముగ వారా బాలుని హతమార్చిరే కాని హృదయమున దుష్టత్వము సహజముగ నున్నవారు కారు. వారు కూడ మునుల పాదములపై పడి ప్రాయశ్చిత్తమును కోరిరి. మునులు సర్వజ్ఞులే అయినను వారు చేసిన పాపకార్యము వారి నోటనే చెప్పించుట వలన వారి పాపము కొంత ఉపశమింప గలదని భావించి, మీరే పాపము చేసితిరి? అని అడిగిరి.

## పాప స్వరూపము :

మహాత్ములు పాప కార్యములు చేసినవారిని నిలదీసి యడుగరు. తెలిసినను మౌనముగ నుందురు. పాపకార్యము చేసినవాడు తన యంతట తాను తెలుపువఱకు వేచి యుందురు. అట్లుండుట లౌక్యము కాదు. పాపి తాను చేసిన పని తనకై తానుగ చెప్పుటవలన ప్రాయశ్చిత్తము కలిగి పవిత్రుడగును. బలవంతముగ చెప్పించ ప్రయత్నించినచో చేసిన పాపములు మరుగు పరుచుటకు మరిన్ని అసత్యము లాడును. అతనిచే మరికొన్ని పాపములను చేయించుట తెలిసినవారు చేయరు కదా! ఇచ్చటొక గమనిక వున్నది. సామాన్యముగ

లోకమున ఒకరు చేసిన పాపములను మరియొకరు చర్చించుచుందురు. ఇతరులకు వివరించు చుందురు. కోపము తీవ్రమైనచో పాపము చేసినవారినే ముఖా ముఖముగ తిట్టిపోయు చుందురు. పాపము చేసినవారిని నిందించుట వలన, ఆ పాపము నందలి కొంతభాగము నిందించు వారలకు పోవును. మహాత్ములట్లు చెయ్యరు, వారు తెలిసినవారు.

చిత్రకేతువు యొక్క రాణులు నారద, అంగిరస మునుల పాదములపై పడి మా పాపములకు ప్రాయశ్చిత్తము కలదా అని ఏడ్చిరి. తెలిసినను అంగిరస ముని 'మీరింత దుఃఖించుటకును, సిగ్గు పడుటకును ఏ పాపము నొనర్చితిరి' అని ప్రశ్నించుటలో వారి ననుగ్రహించు సత్సంకల్పము గోచరించును. వారికై వారుగ వారి పాపములను తెలియ చెప్పుటవలన కొంత కళంకము తొలగునని అట్లడిగెను.

రాణులు "స్వామీ! మీకంతయు తెలిసియుండియు కూడ మమ్ముల నడుగుచున్నారు. ఈర్ష్యకు లోనై మేమే రాజకుమారునికి విష మొసంగితిమి. అతని హత్యయందు మా అందరికిని సమాన పాపభాగము కలదు. మీ రాజ్ఞాపించు ప్రాయశ్చిత్త కార్యమును నిర్వర్తించుటకు మేము సంసిద్ధులుగ నున్నాము. అప్పుడు అంగిరస ముని రాణులకు ప్రాయశ్చిత్త వ్రతమును తెలిపి, యమునా నదీ తీరమున ఈ వ్రతమును రాణులచే నిర్వర్తింప చేయవలెనని

బ్రాహ్మణులను నిర్దేశించెను. యమున కృష్ణ ప్రియమునగు నది. అది కళంకములను బాపు నది యగుటచే అచ్చట వ్రతోపవాసముల నొనర్చి బ్రాహ్మణులు చెప్పిన రీతిని ప్రాయశ్చిత్త కర్మలు రాణులు శ్రద్ధాభక్తులతో నిర్వర్తించిరి. పాపము సంభవించినపుడు హృదయ పూర్వకముగ పశ్చాత్తాపము చెందుట; ప్రాయశ్చిత్త వ్రతము నొనర్చుట వలన పాపము స్వల్ప కాలముననే హరింప బడగలదు. ఇట్టి ఉపాయములు మహాత్ముల కడ మాత్రమే లభించును.

పట్టపురాణి అహర్నిశలు పుత్రుని అంటి పెట్టుకుని యున్నను, రాజ కుమారునికి విష మివ్వబడినది. ఎంత అప్రమత్తతతో వున్నను మృత్యువు రాజకుమారుని ఈ విధముగ బలిగొనుట పట్టపురాణికి ఆశ్చర్యము కలిగించెను. తానెంత శ్రద్ధగ నున్నను, వేయి కన్నులతో పుత్రుని కాపాడుకొను చున్నను విష మెట్లీయ బడినది? తన అశ్రద్ధ కారణముగనే తన కుమారుడు మరణించెనని దుఃఖించుచున్న పట్టపురాణితో ముని లిట్లనిరి.

# 5

.........................................................................................

# మృత్యు స్వరూపము

"**మ**హారాణీ మృత్యువు నెదిరించ జీవుల శక్యముకాదు. ఎట్లు జరుగవలసి యుండునో అట్లే జరుగును. అట్టి బుద్ధులే పుట్టును. ఎంత తెలివి కలిగినను మృత్యు సమయమున, మృత్యువు ప్రవేశించుటకు తగు వాతావరణ మేర్పడును. ఎన్ని కట్టుదిట్టములు చేసినను కూడ తగు సమయమున మృత్యువు అద్భుతముగ, అత్యాశ్చర్యముగ నివ్వెరబోవు రీతిని ప్రవేశింపగలదు. హిరణ్యకశిపుడు, రావణుడు ఆదిగా గల తపస్సంపన్నులు కూడ దేహత్యాగము చేయక తప్పలేదు. మృత్యు విషయమున భగవంతుడట్టి లీలను రచించునని ఎరుగుము. ఈ సందర్భమున నీకు ఒకటి రెండు కథలను ఉదాహరణముగ తెలిపెదను. సావధానముగ విను మని ఇట్లు వివరించెను.

**మృత్యులీల :**

ఒకానొక రాక్షసుడుండెను. అతడు ఘోర తపస్సు చేసెను. బ్రహ్మ ప్రసన్ను డయ్యెను. బ్రహ్మలోకమున తప్ప తన కెచ్చుటను

మృత్యువు కలుగ కూడదని తెలివిగ వరము కోరెను. బ్రహ్మ వరమిచ్చెను. అందుచే అతడు చావక భూమిపై దుష్టకార్యముల నొనర్చుచుండెను. అపుడు శ్రీ మహావిష్ణువు హంస రూపమును ధరించి, అతని నాకర్షించెను. రాక్షసుడు హంసను పట్టి, దానిపై నెక్కెను. హంస భూమండలము నంతను చుట్టి, వివిధములైన రమణీయ దృశ్యములను చూపెను. రాక్షసున కత్యానందము కలిగెను. "ఇతర లోకములను చూపగలవా?" అని హంసను ప్రశ్నించెను. "సమస్త లోకములను నేను చూచి వచ్చితిని. నీకు చూపగలను" అని హంస తెలిపెను. ఆసక్తుడైన రాక్షసుడు అన్ని లోకములను చూపమని కోరెను. హంస భూమి మొదలుకొని, షష్ఠలోకములను చూపెను. రాక్షసుని చూచి "సప్తమమగు సత్యలోకమును కూడ చూచెదవా? ఆ లోకమే సమస్త లోకములకును ఆధారమైనది. ఆ లోకము చూచినచో నీవు సమస్త సృష్టిని చూచినట్లే!" అని తెలిపెను. అత్యద్భుతమైన, సూక్ష్మము సూక్ష్మతరమునైన లోకములను దర్శించుచున్న రాక్షసుడు మైకమునపడి, తాను బ్రహ్మను కోరిన వరమును గూర్చి మరచెను. సత్యలోకమే బ్రహ్మలోకమని తెలియలేదు. అందు హంస వలన ప్రవేశించుటచే తక్షణము మరణించెను. జీవుని గొనిపోవుటకు మృత్యువునకు ఏదో ఒక ఉపాయము దొరకును.

మరియొక అసురు డుండెను. అతడు జలము తప్ప ఇక యే భూతము చేతను తాను మరణించకుండునట్లు వరము కోరెను. భూమి, అగ్ని, వాయువు, ఆకాశములను లోబరచుకొని, అతిక్రమించి,

ప్రవర్తించుచుండెను. ఆ సమయమున వాని సంహారమునకై భూమి జలమయ మయ్యెను. అసురుడు కొంతసేపు గాలిలో తిరిగి, ఒక పర్వత శిఖరముపై విశ్రాంతి గొనుచుండెను. జలము శిఖరమును కూడ చేరుచుండగ రాక్షసుడు మరల ఆకసమున కెగిరి భూప్రదేశము కొరకై వెదకుచుండెను. శరీరధారి కనుక ఎంతోసేపు ఆకసమున నుండుటకు వీలుపడలేదు. భూమిపై దిగుటకు భూమి యంతయు జలమయమై యుండెను. అసురుడు భీతితో భూమి చుట్టును వేగముగ తిరుగుచుండెను. అతనికి ఒకచోట బల్లపరుపుగా కొంత ప్రదేశము జలమయము కాక గోచరించినది. 'బ్రతుకు జీవుడా' అనుకొని, ఆ బల్లపరుపు ప్రదేశమునకు దిగి విశ్రాంతి గొనెను. వెంటనే ఆ ప్రదేశము జలములోనికి హఠాత్తుగ మునిగెను. అసురుడు మరణించెను. ఆ బల్లపరుపు ప్రదేశము ఒక మహత్తరమైన తాబేలు వీపు. తాబేలు రూపమున విష్ణువే మృత్యువున కుపాయము చూపెను. చావును తప్పించుకొని తిరుగువా రెవరును లేరు.

హిరణ్యకశిపుడు బ్రహ్మను తెలివిగా వరము కోరెను. రాత్రి కాని, పగలుకాని, ఇంటి లోపలగాని, వెలుపలగాని, నరునిచే గాని, జంతువుచే గాని, దేవతలచే గాని, అసురులచే గాని, ఎట్టి శస్త్రాస్త్రములచే గాని తాను మరణించకూడదని బ్రహ్మను కోరెను. బ్రహ్మ అట్లే అనెను. వానిని సంహరించుటకు శ్రీ మహావిష్ణువు నరుడు, జంతువు కాని, మరి యే సుప్రసిద్ధ జీవరూపమూ కాని నరసింహుడుగా అవతరించెను. పగలు, రాత్రి కాని సంధ్యా

సమయమున, ఇంటి లోపల బయట కాని ఇంటి గడపపై, శస్త్రము, అస్త్రము కాని తన చేతి గోళ్ళతో హిరణ్యకశిపుని చీల్చి చంపెను. మృత్యువునకు దైవమిట్లు సహకరించి, ధర్మమును నిర్వర్తించుచుండును.

శివ దర్శన సమయమున రావణుని మనస్సునకు మాయగ్రమ్మి, మరణమును ధిక్కరించు వరమును కోరుటలో నరులను, వానరులను లెక్కపెట్టలేదు. వారు కారణముగనే రావణుడు మరణించుట జరిగినది కదా! (అట్లే భస్మాసుర సంహారము, భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనాదుల సంహారము కూడ ఉపాయముచే నిర్వర్తింపబడినది.)

నిత్యము శ్రద్ధాభక్తులతో ఆరోగ్య సూత్రములను ఆచరించుచు, రోగమునకు అవకాశ మివ్వనివారు కూడ ఏదో ఒక కారణముగ మరణించుట జరుగుచుండును. (ఒక పురుషునకు ఇటీవలి కాలమున మరణమెంత నాటకీయముగ జరిగినదో వినుడు. అతడు స్కూటరుపై ఒక ఊరినుండి మరియొక ఊరు ప్రయాణమై పోవుచున్నాడు. దారిలో రైలు కట్టవద్ద అత డాగవలసి వచ్చెను. అదే సమయమున ఒక గ్రద్ద ఒక త్రాచుపామును పట్టి ఆకసమున ఎగురవేసుకొని పోవుచుండగా పాము తప్పించుకొని, ఆ పురుషునిపై పడెను. అతనిని కాటు వేసెను. తప్పించుకొన్న పామును మరల క్షణ కాలమున గ్రద్ద పట్టి ఎత్తుకొని పోయెను. పాము కాటుకు ఆ పురుషుడు మరణించెను. ఒక ప్రణాళిక ప్రకారము మృత్యువు సమస్తమును అత్యంత నాటకీయముగ నిర్వర్తించును. ఇంతకన్న ఏమి చెప్పగలము?)

అంగిరస మహాముని మరియు నిట్లు చెప్పసాగెను. చిత్రకేతువు పిల్లవానికి మృత్యువు వ్రాయబడినది. అదియును విషముచే జరుగునని కూడ నిర్ణయించబడినది. అందువలన మహారాణి ఎంత అప్రమత్తతతో నున్నను, ఆ సమయమునకు తప్పక ఏమరుపాటు కలిగినది. మృత్యువు ముఖమున వ్రాయబడి యున్నపుడు అన్నియు అట్లు సమకూరుచుండును. అకారణముగ ఏ సంఘటనయును జరుగదు. పూర్వజన్మములో మన మెవరి కపకార మొనర్తుమో ఈ జన్మమున వారు మనకు ప్రత్యుపకార మొనర్తురు. పూర్వజన్మమున ఈ పిల్లవాడు ఈ రాణులందరినీ చంపినాడు. అందువలన ఈ రాణులందరి వలన ఇతనికి మరణము సంభవించినది. అంత చిత్రకేతు మహారాజు అదెట్లు జరిగినదో వివరింపుడని కోరెను. అంగిరసుడు పిల్లవాని పూర్వజన్మ వృత్తాంతము నిట్లు చెప్పసాగెను.

**రాణుల పూర్వజన్మ వృత్తాంతము :**

"మహారాజా! ఈ స్త్రీ లందరును పూర్వ జన్మమున చీమలుగ ఒక పుట్టలో వసించుచుండిరి. ఈ కుమారుడును పూర్వ జన్మమున రాజకుమారుడే. రాజ ప్రాసాదమున జరిగిన నొక దైవకార్యమునకు సమర్పింపబడిన నైవేద్యము నందలి ఒక తీపి వంటకమును ఈ చీమలు లేశమాత్రము గొని తమ పుట్టలోనికి పోయినవి. అది చూచిన రాజకుమారుడు ప్రసాదము అపవిత్రమైనదని కోపించి సలసలకాగు వేడి నీటిని చీమలపుట్టలో పోసెను. అవి మరణించినవి.

భగవత్ప్రసాద స్వీకరణ కారణముగ ఆ చీమలే రాణులుగ జన్మించినవి. ఈ కుమారుడు ఒనరించిన పాప కార్యమునకు ప్రతీకారముగ ఈ జన్మమున విషమిచ్చిరి. ఈ రాకుమారుడు సహజముగ జ్ఞాని. కాని తాను చేసిన పాపకార్యపు సంస్కారము హృదయమున మిగిలిపోయినది. దాని ననుభవించుటకు మరల పుట్టవలసి వచ్చెను. అకాల మృత్యువు ద్వారా సంస్కరింపబడి, జ్ఞాని యగుటచే ముక్తిని పొందెను.

"రాజా! ఇదే విధముగ కార్యము లన్నియును ఏదో ఒక కారణముచే జరుగుచుండును. జీవులందరును ప్రారబ్ధముచే వశీభూతులై కార్యముల నొనర్చుచుందురు. కాలము అన్నిటిని జతకూర్చుట నిశ్చయము. కావున సంఘటనలను కాంచి, విచారింపవలసిన పనిలేదు. విస్మయము చెందవలసిన పనియును లేదు. జరుగున దంతయు సరిగానే జరుగును."

**మంత్రదీక్ష :**

చిత్రకేతు మహారాజు శోక మోహములను వీడిన వాడయ్యెను. మృతపుత్రునకు సంస్కారము లొనర్చెను. అతడు రాజ్యమును సమర్థున కొసగి రాజ్యమును వీడిపోయెను. మును ముందుగా సర్వ పాతక నాశినియగు యమునలో స్నానమాడి, మౌనము వహించి, అంగిరస, నారద మహర్షులకు నమస్కరించెను. రాజునకు మంత్రదీక్ష నొసగవలసినదిగ అంగిరసుడు నారదునకు తెలిపెను. అప్పుడు నారదుడు అష్టాక్షరీ మంత్రమును గూఢవిద్యగ నుపదేశించెను. రాజు

మంత్రదీక్షను పొంది, గురువులకు నమస్కరించి మంత్రానుష్ఠానమునకు ఉపక్రమించెను. ఏకాగ్రచిత్తుడై తత్పరతతో అనుష్ఠానము కావించెను.

శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు **సిద్ధగురువొసంగిన విద్య ఎన్నటికిని వ్యర్థము కాదు.** అతడు చెప్పిన ప్రకారము సావధానముగ చేసిన అనుష్ఠానము సఫలమై తీరును. ఈ సంసారమును దాటింపగల సమర్థుడు గురువే. **గురువనుగ్రహము పొందినవారికి మార్గము సుగమము.** ఇతరులకు దుర్గమము.

## విద్యాధరాధిపత్యము :

చిత్రకేతువు శుచియై, విరాగియై తపమొనర్చెను. క్రమముగ శ్రద్ధ, భక్తి, అనురక్తి పెరుగుచుండగ తపము తీవ్రమయ్యెను. తపో తీవ్రతలో అతడు నిద్రాహారములు మరచుచుండెను. తపస్సు అహోరాత్రములు అనుస్యూతముగ దీర్ఘకాలము సాగెను. ఒకానొక సమయమున చిత్రకేతువు ఏడు దినముల వరకు తిననూ లేదు, నిద్రించనూ లేదు. కేవలము కాళిందీ నిర్మల జలములను మాత్రము త్రావి, ఏడహోరాత్రములు మంత్రమును విధివిధానముగ జపించెను. ఏడు దినములైన తరువాత ఒక విచిత్రము జరిగెను. అతడు మరణించక దివ్యశరీరు డయ్యెను. అది కారణముగ దేవత యయ్యెను. దేవతలలో విద్యాధరులను ఒక ఉపజాతి కలదు. విద్యాధరులు మిక్కిలి రూపవంతులు, ఆకాశచారులు, స్వచ్ఛంద విహారులు, దివ్యాస్త్ర భూషణ ధారులు. నారదమహర్షి ఉపదేశము కారణముగ చిత్రకేతువు

కేవలము విద్యాధరు డగుటయేకాక, విద్యాధరాధిపతి యయ్యెను. నారదుని ఉపదేశము అమోఘము. ధ్రువ, ప్రహ్లాదాది భక్తులను గూడ అత్యంత శ్రేష్ఠ పదవికి మార్గము చూపిన మహర్షి. సమస్త లోకములకును వెలుగు. అతని అనుగ్రహముచే విద్యాధరాధిపతి అయ్యును, చిత్రకేతువు అష్టాక్షరీ మంత్రమును అనుష్ఠానము చేయుచునే యుండెను. అది కారణముగ సంకర్షణుడగు ఆదిశేషుని చరణారవింద సమీపమునకు చేరుకొనెను. అతనికి ప్రత్యక్షముగ ఆ ధరణీధరుని దర్శనమయ్యెను.

6

........................................................................................................

# దివ్య దర్శనము

**ఆ** సహస్ర ఫణ మండితుని ఒక్క ఫణము మీద ఆవగింజవలె ఈ పృథివి యుండెను. అతనికి నలువైపులను సిద్ధేశ్వరులు అంజలులను ఘటించుచు నిలబడి యుండిరి. అతని వేయి పడగలు శోభాయమానములై వేయి సూర్యుల కాంతి ఒక్కసారిగ వెదజల్లు చున్నట్లుండెను. అనంతుని శరీరము నీలమై, చందనపు పూతతో, తారకలే మణిహారములుగ తేజోమయముగ నుండెను. అత్యంత మనోహరముగను, అత్యంత ఆకర్షకముగను అతని ఆకారము గోచరించెను. ముఖము మందహాసముతో నుండెను. అతని కన్నులు పద్మములవలె అందముగను, కొంచెము ఎర్రగను నుండెను.

చిత్రకేతువు ఆనందభరిత హృదయముతో తన ఇష్ట దైవమును దర్శించెను. దర్శన మాత్రమునే అతని పాప సంతాపము లన్నియును నశించెను. అంతఃకరణమున మిగిలిన లేశమాత్రపు మలినము కూడ తక్షణమే నశించెను. దీనిచే అంతఃకరణము శుద్ధమును, నిర్మలమును అయ్యెను. భగవానుని దివ్యచరణములపై పడి సాష్టాంగ ప్రణామ

మాచరించెను. ఆనందాశ్రువులతో అనంతుని పాదముల నభిషేకించి, స్తుతింపబోయి చాలసేపు స్తుతింపలేక యుండెను. (అనంతుని దర్శనమున తా ననంతునిలో భాగమై నిలచుటచే తన వ్యక్తిత్వము అనగా ప్రత్యేకత కోల్పోయెనని భావము. తన మనస్సు, ఇంద్రియములు, శరీరము, ప్రజ్ఞ అనంతుని అధీనమున నుండుటచే స్తుతింపలేక కేవలముండుట జరిగినది.) అనంతుని అనుమతితోనే, అనగా అనుగ్రహముతోనే, మనస్సు, ఇంద్రియములు, వాక్కును ప్రజ్ఞతో సమకూర్చుకొని చిత్రకేతువు అనంతుని స్తుతింప మొదలిడెను.

**అనంతుని స్తుతి :**

విద్యాధరాధిపతి అయిన చిత్రకేతువు అనంతుని దర్శించి ఈ విధముగ స్తుతించెను. "నీ వెవ్వరి చేతను జయింపబడని వాడవు. సమస్తమును జయించువాడవు. నీ అనుగ్రహముచేత నీ భక్తులు కూడ సమస్తమును జయించుదురు. భక్తులకు జయము కూర్చుట నీకు వేడుక. వారికి శుభ పరంపరలను అనుగ్రహించుచూ ఆనంద పడుచుందువు. వారిచే జయింప బడుటకు కూడ నీ వంగీకరింతువు. అపారమైన ప్రేమ, వాత్సల్యము నీకు భక్తులయందు వుండుటచే వారి ననుగ్రహించుట, వారికి సేవలు చేయుట, వారి కోరికలు తీర్చుట చేయుచుందువు. నీ సాన్నిధ్యమున సమస్త కామములును తీరి భక్తులు పూర్ణకాము లగుదురు."

"లోకము లన్నియు ఉద్భవించుట, ప్రకాశించుట, లీనమగుట నీ వైభవములే. నీవు వ్యక్తమైనప్పుడు లోకము లగుపించును. నీవు

అవ్యక్తుడవై వున్నప్పుడు సమస్త లోకములు, లోక జీవులు నీయందిమిడి యుందురు. సమస్తము నీయందే ఉద్భవించి వృద్ధిచెంది లయ మగుచుండగ జీవులు తామున్నామని, లేమని, పెరిగినామని, తరిగినామని భావన చెందుచుందురు. నిజమునకు నీవు భావించుటయే వారుండుట. లోకములను సృష్టించు బ్రహ్మ, ప్రజాపతులు కూడ నీనుండి పుట్టినవారే కదా! సృష్టి సమస్తమునకు నీవే ఈశ్వరుడవు.

"అణువులోని పరమాణువు మొదలుకొని బ్రహ్మాండము వఱకు ఈ సృష్టి అండములో ఏర్పడు ప్రతి వస్తువు నందును నీవే నిండియున్నావు. కనుక అన్నియును నీకే చెందియున్నవి. నిన్ను కీర్తించువారు, కీర్తనము కూడ నీవే. నేనుండుట కూడ నీ వుండుటయే. నీవు త్రయీవిదుడవు. త్రిగుణాత్మకమైన సృష్టి నీయం దేర్పడుచున్నది. దానికి ఆది, అంతము కలదు. నీవు మెలకువ, నిదుర, కల కూడ తెలిసిన వాడవు. జీవులు ఒక అవస్థ యందున్నప్పుడు అది సత్యముగను, ఇతర అవస్థలు అసత్యములుగను గ్రహించుచుందురు. నిదురయందు వారికి మెలకువ, కల, స్థితులు అసత్యములు. అటులనే మేల్కొంచినపుడు నిదుర, కల అసత్యములు. కలలో నిదుర, మెలకువ అసత్యములు. ఈ మూడింటి యందు ఏదో ఒక స్థితి జీవు డనుభవించును. కాని ఈ మూడింటికి అతీతముగ తానున్నాడని జీవులకు గోచరింపదు. ఈ మూడు స్థితులును నీవు ఒకే సమయమున తెలిసియున్నవాడవు కావున నిన్ను త్రయీవిదుడని తెలిసినవారు కొనియాడుదురు."

"నీయందు సప్తలోకము లుద్భవించుచున్నవి. ఒక్కొక్క సప్తలోకముల కూర్పు ఒక్కొక్క బొడ్డుగ ఏర్పడి ఏడు కోశముల మొగ్గగ వికసించుచుండును. అట్టి అండములు, కోశములు కోటానుకోట్లుగ యున్నవి. మానవ శరీరమున ఎన్ని రెట్ల కణములు యున్నవో, నీయందు అన్ని సృష్టి అండకోశము లున్నవి! నీ అనంతమైన రూపమునందు భూగ్రహమే ఆవగింజంత వుండగ, అందలి జీవులు ఎంతటివారు. సమస్తమునకు **ఈశ్వరుడైన నిన్ను ఆశ్రయించుటయే ఐశ్వర్యము** కాని ఇతర కోరికలలో పడి కొట్టుకొనుచుండుట దురదృష్టము.

సమస్త దేవతలు నీయందు ఉద్భవించి నర్తించి లీనమగు చుండగ నిన్ను మరచి దేవతల నారాధించువారు మూర్ఖులు. ఈ దేవత లిచ్చు సంపదలు ప్రభుత్వము లిచ్చు సన్మానముల వంటివి. ఏ ప్రభువు చేసిన సన్మానము ఆ ప్రభువుతోనే నశించును. అట్లే దేవత లిచ్చు సంపదలుకూడ! ఉపాసించువారి మనస్సులలో పుట్టు దేవతల బలము వారి ఆరాధనా బలముపై ఆధారపడి యున్నది. ఉపాసన జరుగని రోజు వారి మనస్సులో ఆ దేవత కూడ అదృశ్యమగును. మనస్సు ఏర్పరచుకొను దేవతలు మనస్సుతో పాటు అంతరింతురు. అనగా ఉపాసకుడు, ఉపాస్యదేవత కూడ లేకపోయి అంతర్యామియైన నీవు మిగులుదవు."

"నిన్నాశ్రయించిన వారు నీవలెనే, నీ అనుగ్రహము వలన శాశ్వతు లగుదురు. వారు దేహముల యందు ప్రవేశించుట,

నిర్గమించుట జగత్కళ్యాణము కొఱకై చేయుచుందురు. ఇతర జీవులవలె పుట్టుట, చచ్చుట అను భ్రమను పొందరు. నీ అనుగ్రహము వలన వారికి వికుంఠత్వము లేదు. కావున వైకుంఠమునందు వుందురు.”

అనంతుని స్తుతి చిత్రకేతువు మరియు ఇట్లు సాగించెను.

“నీయందు గుణము లుండును కాని నీకు గుణము లుండవు. గుణాతీతుడుగ నీవు జ్ఞాన స్వరూపుడవు. గుణవంతుడుగా నీవు విజ్ఞాన స్వరూపుడవు. నీ దివ్య గుణములను ధ్యానించుటలో అసత్యము లేదు. నీ గుణములను కీర్తించుట ద్వారా నీయందు స్థిరపడుటకు వీలగును. నిన్ను గుణవంతునిగను, గుణాతీతునిగను ఎట్లైనను ఆరాధించ వచ్చును. ఏ రూపమున, ఏ నామమున ధ్యానించినను నీ వంతర్యామివని, సదుపాయము కొఱకై నామ రూపముల ధ్యానింపబడు చున్నావని గ్రహించి ధ్యానించినచో మోక్షము కలుగును. **నిన్నొక నామమునకు, రూపమునకు మాత్రమే పరిమితి చేయువారు వెఱ్ఱిభక్తులు.**

**అంతర్యామియందే తామున్నామని ధ్యానించుచూ జీవించుట భాగవత ధర్మము.** ఇచ్చట సమస్తమును అంతర్యామిగను, తాను ధ్యానించు వాడుగను, తనయందు కూడ అంతర్యామి తనవలె వున్నాడని తెలిసియుండుట శేష శేషిత్వ సంబంధమగును. సమస్తము లయ మగునపుడు కూడ తాను మిగిలి యుండును, కావున నీవు శేషుడవు. నీవు సర్వ శేషివి. నీ నుండియే సమస్త జీవరాసులు

దిగివచ్చుచున్నవి, నీలోనికే సమస్త జీవరాసులు లయ మగుచున్నవి. జీవు లందరియందు నీవే అంతర్యామిగా వర్తించుచున్నావు. అందుచే **జీవులను చూడక నిన్ను చూచుట భాగవత మార్గము.** జీవులను చూచినచో మోహమున పడుదురు. నిన్ను చూచినచో మోక్షమున నుందురు. పరమ భాగవతు లందరును తమ దినచర్య సమస్తమును నిన్ను దర్శించుచు, నిర్వర్తింతురు కనుక నీయందు యోగము చెందినవారై యున్నారు. సనత్కుమారాదులు కూడ నిన్నిట్లే ధ్యానించుచు శాశ్వత మోక్షస్థితి యందు నిలిచియున్నారు. నీవే భాగవత ధర్మముగ ఈ యోగమార్గము నేర్పరచితివి. అంతర్యామి స్మరణ మాత్రమున ఈ మార్గమున నిలుచుట సాధ్యము. ఈ ధర్మము నవలంబించు జీవులయం దజ్ఞాన ముండదు. తరతమ భేదము లుండవు. వృక్షములు, పశుపక్ష్యాదులు, మానవులు, పంచభూతములు ఆదిగా గల రూపముల యందు నీవే దర్శన మగుచున్నావు. ఈ దర్శనమున సమస్త కోరికలు తొలగిన వాడనైతిని. మోహమున మునిగియున్న నన్ను నారదు డనుగ్రహించి మార్గమును దయచేసెను. నేడు నీవలన నాకది దర్శన స్వరూపముగ నిలచినది.

నాబోటివారు నీ మహాత్మ్యమును వ్యాప్తి చేయగలరా? నీవే నీ వైభవమును దర్శింప చేయుచున్నావు. భాగవతోత్తములు పొందుచున్న వైభవము వలన అంతర్యామి వున్నాడని తెలియబడదు. అంతర్యామి వెలుగులే ఆ మహానుభావులని తెలియబడును. నీవు వారినుండి ప్రకాశించుటచే నీ వైభవము దర్శిత మగుచున్నది కాని వారు నిన్ను

ప్రకాశింప చేయుట లేదు. దైవ మున్నాడని తెలుపువారు కారణముగ దైవము లోకమున స్థాపితము కాలేదు. తాముండుట యెట్లో శోధించినవారికి దైవ మున్నాడని తెలియును. అట్లు తెలిసిన వారినుండి దైవమే వ్యాప్తి యగును. అంతియే కాని **దైవమును వ్యాప్తిచేయు భావన రాజసికము, అహంకార పూరితము** నగును. నీ దర్శనమున నాయందు ఉబికిన ఆనందమే, ఈ స్తోత్ర పరంపరకు కారణము కాని, నేను నిన్ను స్తుతించగల వాడను కాను. బ్రహ్మాదులు కూడ నిన్ను స్తుతింపలేమని తెలుపుచు స్తుతించుచు నుందురు. అనంతమైన నీ రూపమునకు నమస్కరించు చున్నాను. భగవంతుడవైన నీకు నమస్కరించు చున్నాను."

అనంతుడు ప్రసన్నుడై విద్యాధర ప్రభువగు చిత్రకేతునితో నిట్లు అనుగ్రహ భాషణము చేసెను.

7

..................................................................................................

# సంకర్షణుని ఉపదేశము

**వి**ద్యాధర ప్రభువైన చిత్రకేతువు అనంతుని స్తుతింపగ, అనంతుడు ప్రసన్నుడై చిత్రకేతువుతో ఇట్లని పలికెను.

1.“అంగిరసుడు, నారదుడు నన్నెరిగిన వారు. వారి వలన నన్ను చూడగలిగితివి.” (ఇది గమనింప తగిన వాక్యము. భగవత్ దర్శనమునకు కారణమైన క్రమమంతయు దైవానుగ్రహముగ భావింపవలెను. చిత్రకేతువునకు మొదట అంగిరసు డుపదేశించెను. పిదప నారదు డుపదేశించెను. నారదు నుపదేశము తరువాత చిత్రకేతువునకు భగవత్ దర్శనము కలిగినది. అది కారణముగ చిత్రకేతువు నారదుని అనుగ్రహముచేత తనకు దైవ దర్శనము కలిగినదని తెలుపగ అనంతుడు అంగిరసుని కూడ గుర్తు చేసెను. అంగిరసుని ఉపదేశము కారణముగ నారదుని ఉపదేశము కలిగినది కావున అంగిరసుడును, నారదుడును కూడ భగవత్ దర్శనమునకు మార్గ మేర్పరచిరనియు, అంగిరసుని మరచుట ఔచిత్యము కాదనియు అనంతుడు మొట్టమొదటగ హెచ్చరించెను. భగవత్ ప్రాప్తికై ఉపకరించిన వారందరును భగవంతుని దూతలే యని గ్రహింపవలెను. ఆ

క్రమము నంతను స్మరింపవలెను. కాని, కొందరిని విస్మరించుట తగదు. తన ఉన్నతికి కారకులైన వారందరును అంతర్యామియొక్క సగుణమూర్తులే అని భగవంతుడు ప్రతిపాదించు చున్నాడు. సాధకులు ఈ విషయమున అప్రమత్తులై యుండవలెనని భగవంతుడు మొదటగ పై విషయమును పలికెను.)

2. "నా రూపమే ఈ జీవరాసులు. నన్ను భూతభావను డందురు." (భూతభావను డనగా సమస్త జీవరాసులను తనయందు భావన చేయువాడు అని యొక అర్థము. భగవంతుని భావము నుండియే సమస్త జీవరాసులును వ్యక్త మగుచున్నవి. అతడు భావించుట చేత సృష్టి, సృష్టిజీవులు ఏర్పడుదురు. ఉదాహరణకు ఒక కథకు సంబంధించిన పాత్రలన్నియు రచయిత భావమునుండి పుట్టినవే కదా! అట్లే భగవంతుని ఊహనుండి సమస్త వ్యూహములు, జీవులు పుట్టుచున్నారు అని అర్థము. భూతములచే అనగా జీవులచే భావన చేయబడు వాడనికూడ మరియొక అర్థము. భగవంతుని భావననుండి దిగివచ్చిన జీవులు మరల భగవంతుని చేరుకొనుటకు అతనినే భావన చేయుదురు కదా! ఇది మరియొక అర్థము. జీవులు చేయు భావనలు కూడ, వారు దేవుని యందు వుండుటచేతనే జరుగుచున్నవి. కావున అశేషమైన జీవరాసులు చేయు అశేషమైన భావనలు అన్నియు కూడ శేషునియందే జరుగుచున్నవని మూడవ అర్థము.)

3. "నాకు రెండు దేహము లున్నవి. అవి బ్రహ్మము, శబ్ద బ్రహ్మము అనునవి. ఇవి రెండునూ శాశ్వతములే." (బ్రహ్మము అనగా సర్వాంతర్యామి. బృహ్మణము లేక వ్యాపించుట అను లక్షణము కలవాడు. ఇది మొదటి శరీరము. ఇందుండి శబ్ద బ్రహ్మముగ అనగా ఆకాశముగ రెండవ శరీర మేర్పడును. ఇందు మొదటివానిని పురుష డనియు, రెండవది ప్రకృతి యనియు అందురు. ఈ రెండును శాశ్వతములే. ఇందొకటి లేక రెండవది లేదు. ప్రకృతి – పురుషలను సమముగ ఆరాధించిన వారికే పూర్ణ దర్శనము కలుగగలదు. అదియే అనంత దర్శనము. అట్టి సమారాధన లేనివారికి చిల్లర దర్శనములు జరుగుచుండును.)

4. "ఈ ప్రపంచము నానుండి వ్యాపించినది. కోటానుకోట్ల జీవులు కూడ నానుండియే వ్యక్తమైనారు. ప్రపంచమునకు, జీవునకు నేనే ఆధారము. నాలో ఐక్యత చెందిన జీవునకు ప్రపంచ ముండదు. నేనే యుందును. ఇతరులకు ప్రపంచ ముండును. ప్రపంచమునకు, జీవులకు అన్యోన్య ఆశ్రయ సంబంధము కలదు. ప్రపంచము నాశ్రయించుకొను జీవులు, జీవుల నాశ్రయించిన ప్రపంచము వుండును. నాలో నున్న లోకములు, లోకులు నానుండి వ్యక్తమై నాతోనే యుందురు. మరల నా వైపునకు గమనము చేయుచు నా యందు లీనమగు చుండును. జీవులు దీనిని నిత్యము అనుభవించుచును తెలియలేరు. అదియే నా మాయ. నిజమునకు జీవునకు నిద్రయందు

తాను లేదు, తన ప్రపంచము లేదు. నాయందు రెండునూ లయమై యున్నవి. మేల్కాంచగనే తాను, తన కుటుంబము, తన సమస్యలు, తన ప్రపంచముగ భాసించును. నిద్రయందు లేని ప్రపంచము, మెలకువ యందు సత్య మనిపించును. ప్రపంచమున సర్వమును నేనుగ భావన చేయువాడు మాత్రమే నా మాయను దాటగలడు. కావున ప్రపంచమును కూడ దాటగలడు. ఇట్లుకాక దాటుటకు వేరొక మార్గములేదు. సంబంధము నాతో నున్నచో ప్రపంచము బంధించదు. లేనిచో ప్రపంచము జీవుని బంధించును. జీవుడు ప్రపంచమున బంధింపబడును.

జీవులు పొందు సుఖము, వారు సిద్ధాంతీకరించు సత్యము, స్వప్నములోని సత్యముల వంటివి. స్వప్నములోని అనుభవము మెలకువన సత్యము కాదు. మెలకువలోని అనుభవము నిద్రలో సత్యము కాదు. వాస్తవమునకు రెండునూ స్వప్నములే. ఒకదాని యందున్నప్పుడు రెండవది కల. నిజమునకు నిద్రకూడ సత్యము కాదు. జీవుడు నిద్రయందు కొంతసేపు, కలయందు కొంతసేపు, మెలకువ యందు కొంతసేపు యుండును. ఈ మూడును కాక తా నున్నాడు. తా నుండుట చేతనే మూడింటి యందును తిరుగాడు చున్నాడు. కావున ఈ మూడు ఆవరణములను దాటియున్న తనను తెలియుటయే తెలివి."

5. జీవుడు బంధ మోక్షములను చక్రములో ఏల పడినాడు? నానా యోనులలో మరల మరల ఏల పుట్టుచున్నాడు? అని

అడుగుచున్నావు. "వాస్తవమునకు జీవుడు పుట్టుటయును లేదు. చచ్చుటయును లేదు. అతడు శాశ్వతుడు. ప్రపంచ కల్పనములో ఇమిడినపుడు మార్పులను అనుభవించుచున్నట్లుగ తోచును. ఇది తన నిజస్థితిని మరచుట వలన జరుగుచున్నది. తెలిసిన వానికి పుట్టుకయును లేదు. చావును లేదు. ఉండుటయే ఉండును."

6. "జీవులు సదా సుఖము కొఱకే ప్రయత్నించు చుందురు. అట్టి యెడ దుఃఖప్రాప్తి ఏల కలుగుచున్నది?" అని ప్రశ్నించుచున్నావు. రాజా! దుఃఖమునకు కారణము కేవలము ఫలమునం దాసక్తియే. ఫలాసక్తి చెందక కర్మానుష్ఠానము నందు మాత్రమే ఆసక్తి కలవానికి దుఃఖప్రాప్తి యుండదు. సుఖాసక్తితో పనులు చేయుట మాని కర్తవ్యమునందు ఆసక్తి కలిగియుండుట, దానిని నిర్వర్తించుట కర్మానుష్ఠాన బుద్ధి యని యెరుగవలెను. సుఖాసక్తి యున్నచోట దుఃఖప్రాప్తి యుండును. సుఖాసక్తి లేనిచోట దుఃఖప్రాప్తియును వుండదు. కర్తవ్య నిర్వహణమే ప్రపంచమున జీవికి తరణోపాయము. కర్తవ్యమున సుఖ మంతర్హితమై యుండును. ఈ ఉపాయము తెలియక తెలిసినవార మనుకొను వారు కూడ సుఖప్రాప్తి కొఱకును, దుఃఖ నివృత్తి కొఱకును కార్యము లొనర్చుచుందురు. వారి గతి తలక్రిందులుగ నుండును. ఉత్తర దిశగ ప్రయాణమును సంకల్పించి దక్షిణమునకు చేరుదురు. శాశ్వత సుఖము వారికి ఎండమావి యగును.

7. కనబడుచున్నది దృశ్యమాన జగత్తే కదా! దీనియందు ఆసక్తి చెందక మానవుడేమి నిర్వర్తించగలడు. కనబడుతున్న దానియందు దేనిని ప్రేమింపక జీవు డేమి చేయగలడు? అని ప్రశ్నించుచున్నావు. "ప్రపంచమును నా వ్యక్తరూపముగ చూడుము. ఆ రూపమున నున్న నన్ను ప్రేమించుము. అప్పుడు నా భక్తుడ వగుదువు. **సమస్తమును నన్నుగ ప్రేమించుట, నన్ను చేరుటకు మార్గము.** అట్లు ప్రేమించినచో నీవు దేనిని ప్రత్యేకముగ విసర్జించ వలసిన పనిలేదు. కోటానుకోట్ల రూపమున నున్న నన్ను గమనించుచు ఆనందమున నుండగలవు. **సంసారమును నన్నుగ చూడుము.** నన్ను జూచువాడు ఇతర విషయములందు, పదార్థములయందు సహజ విరాగము చెంది యుండును. అట్టి విరాగము చెందుటయే భక్తి. అది సమస్తమును నన్నుగ ప్రేమించుట వలన ఏర్పడుచున్నదే కాని దేనిని విసర్జించుట వలన కాదు.

ఈ తెలిసిన దానిని నిత్యము వినియోగించవలెను. ఇహపరములను, తెలిసిన వివేకమునం దుండును. జ్ఞానము విజ్ఞానము అను రెండింటి చేతను సంతృప్తి చెందినవా డగును. అట్టి సంతృప్తితో యోగవిద్యను జోడించి నా యం దుండును. నీ వట్టి స్థితినే ఇపుడనుభవించు చున్నావు. నా ఈ ఉపదేశము ననుసరించి నీవు జ్ఞాన విజ్ఞాన పరితృప్తుడవు, భగవద్భక్తుడవు, నిత్యముక్తుడవుగ చిరకాలము జీవించుము" అని పలికి అనంతు డదృశ్యుడయ్యెను.

చిత్రకేతువు అనంతునితో యోగస్థితి చెందుటచే చాలసేపు ప్రముదితుడై అట్లే నిలచి యుండెను. క్రమశః తన వ్యక్తిత్వమును పొంది అనంతు డంతర్ధానము చెందిన చోటునకు చాలసేపు నమస్కరించుచు ఆనందాతిశయమున నుండెను.

విద్యాధరాధిపతి యగు చిత్రకేతువు సంకర్షణుని దర్శనము చేతను, అతని ఉపదేశము వలనను కృతార్థుడయ్యెను. అజ్ఞానము నివృత్తి అయినను అతనికి ప్రారబ్ధశేష మున్నది. జ్ఞానము కలిగినను జీవన్ముక్తునకు ప్రారబ్ధశేష ముండును. సంచిత కర్మములు నాశనమైనను, శరీర ప్రారబ్ధకర్మ ననుభవింప వలయును. చిత్రకేతువునకు కొంత భోగము కూడ అవశేషముగ నుండెను. వానిని భోగించుచు అత డాకాశ మార్గమున దివ్యలోకముల యందు విహరించు చుండెను. అతని దివ్య విమానము తేజోమయము. సంపదలతో కూడినది. మిక్కిలి అందమగు విద్యాధర స్త్రీలు అతని సేవలో నుండిరి. తన యోగ ప్రభావముచే ఆ భోగము లన్నింటిని నిష్కామ భావముచే భోగించుచు అతడు స్వచ్ఛందముగ విహరించు చుండెను. ఇంద్రలోకము, వరుణ లోకము, గంధర్వలోకము, సిద్ధుల లోకము సందర్శించుచు, ఆయా లోకముల యందలి మాధుర్య మనుభవించు చుండెను. శ్రీహరియొక్క యశమును సుందరులచే గానము చేయించి అతడు శ్రద్ధతో వినుచుండెను.

ఈ విధముగా తన యోగమును, ఐశ్వర్యమును, అదుపులేని విహారమును చూచుకొని కొంచెముగ మదమును చెందెను. ఎట్టి వానికైనను ఈ మదమను శత్రువు జనించుటకు అవకాశము కలదు. భగవద్భక్తులకు మదము సంభవించినచో మదహారి యగు మధుసూదనుడు, ఆ మదమును వెంటనే నాశనము గావించును.

# 8

# కైలాసయాత్ర

ఒక దినమున చిత్రకేతువు తిరుగాడుచు కైలాసము మీదుగ పోవుచుండెను. అచ్చట మునిజన గోష్ఠిలో కూర్చుండిన సదాశివుడు కనపడెను. శివునకు మర్యాదను చూపుటకై అతడు విమానమును క్రిందకి దించి, విమానము మీద కూర్చుండియే శివునికి ప్రణామము కావించెను. శివుడా సమయమున ప్రకృతి సౌందర్యముతో విలసిల్లుచుండిన కైలాస శిఖర మందుండెను. ఊర్ధ్వరేతస్కులగు బ్రహ్మచారులు సనకాది మానస పుత్రులతో అతనిని పరివేష్ఠించి యుండిరి. సిద్ధులు, చారణులు, గంధర్వులు అతనిని స్తుతించుచుండిరి. భూత, ప్రేత, పిశాచ, శాకిని, ఢాకిని, యక్ష, రాక్షస, భేతాళ, గుహ్యక ఆదిగా గల ఉపదేవతలు అతని సేవలో నుండిరి. అతని జడలలో నుండి గంగ తరంగములతో కూడినదై ఉప్పొంగి కైలాస శిఖరము పైకి ప్రవహించుచుండెను. నుదిటిమీద నున్న తిలకముతోపాటు విదియ చంద్రుడు వెలుగుచుండెను. కంఠము, బాహు భుజములు రుద్రాక్షలచే అలంకరింపబడి యున్నవి. శివుడు కోటి సూర్యుల ప్రభతో తేజోవంతుడుగ కన్పట్టెను.

త్రైలోక్య సుందరియగు పార్వతీదేవి పదహారు కళలతో మణిమయ కాంచన భూషణాదులు అలంకరించుకొని శివుని ఎడమ తొడపై కూర్చుని యుండెను. భగవానుడు తన ఎడమచేతితో జగన్మాతను ఆలింగనము చేసుకొని యుండి కుడిచేతితో మునుల కుపదేశించు చుండెను. శివుని వక్షస్థలము నానుకొని యుండి ప్రేమ నిమగ్నయై పార్వతీదేవి శంకరుని అంకమందు బ్రహ్మానందము చెందుచుండెను. చిత్రకేతువునకు ఈ అంశము వికారముగ గోచరించినది. మునులకా ధ్యాసలేదు. వారందరు శివ పార్వతులను ఒకే శరీరములోని రెండు భాగము లను భావనతో భేదములేని స్థితిలో భగవంతుని బోధలు వినుచున్నారు.

చిత్రకేతువునకు కనపడినది మునులకు కనబడుట లేదు. వారు పరమాత్ముని బోధయందు నిమగ్నులైరి. మునులకు కనపడుచున్నది, వినపడుచున్నది, మదము కారణముగ చిత్రకేతువునకు దర్శనము కాలేదు. అతడు శివపార్వతుల స్థితిని చూచిన విధానమున అసంతృప్తిని పొందినాడు. శివుడు సదాచారము నుల్లంఘించు చున్నాడని అతడు భావించెను. పత్ని తన అర్ధాంగి అయినను, అందరిముందు ఇట్లు వెగటుగ శివుడాసీనుడై వుండుట, అతనికి నచ్చలేదు. శివునకు ప్రణామ మొనర్చి తన దారిన పోయిన బాగుండెడిది. ఐశ్వర్య యోగ మదములు అతనిని చుట్టుముట్టుటచే

అర్ధనారీశ్వరుని చూచి నవ్వుచూ పార్వతీదేవి వినునట్లు ఇట్లనెను. అందరూ వినుచుండునట్లుగ ఎవ్వరినీ సంబోధింపకయే ఇట్లు పలికెను.

**ప్రేలాపన :**

"ఆహా! భగవన్మాయ ఎంత విచిత్రమైనదో కదా! ఈ శివుడు మహాదేవుడు, దేవాధిదేవుడు, సర్వ శ్రేష్ఠుడు, సర్వ ధర్మములకు, సదాచారమునకు ఆచార్యుడు కూడ. సృష్టిలోని సమస్త దేవతలకు, సిద్ధులకు, మునులకు కూడ ఇతడు ధర్మ ప్రవక్త, ఉపదేష్ట, శిక్షకుడు. ఈతడందరికిని ప్రమాణము. ఈతడు జగద్గురువు. ఇంతటి వాడైనను ఈతని ఆచరణము మానవుని ఆచరణము కన్న మిక్కిలి హీనముగను, క్షుద్రముగను వున్నది. నిండు సభలో ఈతడు తన భార్యను ఆలింగనము చేసుకొని కూర్చుని యున్నాడు. ఇతని ప్రవర్తన సదాచారమునకు విరుద్ధముగ నున్నది. మహాదేవుడయ్యు ఎందులకో ఈతడు నిండు సభయందు కాముకునివలె భార్యను తొడమీద కూర్చుండబెట్టుకొనినాడు."

చిత్రకేతు వాడిన దుర్భాషలకు సభలోని వారందరూ కలత చెందిరి. వారి హృదయములు బాధాతప్తములైనవి. కాని సభాపతియగు శివుని అనుమతి లేక మాటాడుట సభా నియమ విరుద్ధమని భావించి చిత్రకేతువును ఖండింపక వూరకుండిరి. అందరును మహాదేవుని మంగళకరమైన ముఖమును చూచుచు మౌనము వహించిరి. పరమ

గంభీరుడు, అగాధమగు బుద్ధి గలవాడునగు సదాశివునకు నవ్వు వచ్చెను. ఆయన నవ్వుల కాంతిచే పది దిక్కులును మరింత వెలుగొందెను. అతని నవ్వు "ఈతడు బాలుడులే, ఈతని మాటలను పట్టించుకొనవలసిన పనిలేదు" అన్నట్లు గోచరించెను.

విషయ మేమనగా, పెద్దవారిలో మిక్కిలి గంభీరత యుండును. నూతన సాధకులు, నూతన భక్తి, నూతన జ్ఞానము, నూతన యోగము, నూతన వైరాగ్యము అను నూతనమైన రక్తమును కలిగి యుండుటచే మిక్కిలిగ ఎగిరి పడుచుందురు. గర్వముచే అనరాని మాటలందురు. నిన్న మొన్నటి వఱకు పెద్దవారి ఎదుట కట్టు గుడ్డలేక తిరిగినవారు కొంచెమేదో తెలియగానే ఒళ్ళు తెలియని మదమున ప్రవర్తింతురు. వారి అదిరిపాటు వారినే భంగపరచునని ఎఱిగి పెద్దలు మౌనము వహింతురు. ప్రత్యుత్తర మొసంగరు. ఈ న్యాయము చేతనే చిత్రకేతువు పలికిన పలుకులకు మహాదేవుడు ప్రత్యుత్తర మీయలేదు. నవ్వి యూరకుండెను.

మహాదేవుని గూర్చి చిత్రకేతువు పలికిన పలుకులకు పార్వతీదేవి సహింప జాలకపోయెను. ఆమె ఇట్లనెను.

## పార్వతి కోపము :

"ధన్యుడవు! ధన్యుడవు! నేటి వఱకును ఈ శివునిపై ఎవనికిని అధికారము లేకపోవుటచే స్వేచ్ఛాచారము నొనర్చు చున్నాడు.

తన మనస్సునకు తోచునట్లు ప్రవర్తించుచున్నాడు. ఇప్పటికి శివుని మీద ఒక క్రొత్త శాసకుడు పుట్టుకొని వచ్చినాడు. ఆచార హీనులము, సిగ్గులేని వారము అయిన మాబోటి వారికి ఈతడు ప్రభువు. ఈతడు మమ్ములను, మిమ్ములను బాగుచేయ దలచినాడు. ఈతడు సంస్కారి కాబోలు! శాసకుడు, ఉపదేశకుడు, ధర్మ ప్రవర్తకుడు కాబోలు! మాకు సదాచారము నేర్ప యిచ్చుటకు అరుదెంచినాడు. మమ్ములను దండించుటకు ఇతడే విధాయకు డేమో! సదాచారమును మాకు బోధించును కాబోలు." ఇట్లు పార్వతీదేవి పలుకుచుండ, ఆమె సమీపముననే యున్న సఖియగు జయ ఆమెను శాంతింపచేయుచు ఇట్లనెను.

"అమ్మా! పోనిండు, భగవాను డేమియు అనలేదు. మీకేల? అతడు తెలియక పలికినాడు. లౌకిక ధర్మమున పలికినాడు కాని, అలౌకికమగు శివలోక మతనికి తెలియదు కదా!"

ఆ మాటలకు ప్రతిస్పందించుచు పార్వతీదేవి రోషముతో ఇట్లనెను : "ఇతడేదో గొప్ప ధర్మాత్ముడివలే మాట్లాడుచున్నాడు కదా! సర్వధర్మములు ఎరిగినట్లు అనుకొనుచున్నాడు కదా! సృష్టికర్త, ధర్మ ప్రవర్తకుడు నగు బ్రహ్మ కూడ ధర్మ మర్మములను మహాదేవుని వద్ద తెలుసుకొనుటకు వినమ్రుడుగా ఆసీనుడై వుండును. భృగువు ఆదిగా గల తేజస్వి, తపస్వివరులకన్న వీడు గొప్పవాడా? సురాసురులచే నమస్కరింపబడుచు, సమస్త లోకములకును పూజనీయుడై, ప్రజాపతులచే

కూడ నిత్యము పూజింపబడు సదాశివుని ప్రవర్తనమున దోషమును చూడగలిగిన నీచుని నేను సహింపజాలను. నారదుడు, బ్రహ్మ మానస పుత్రులైన సనక సనందనాదులు, ఉత్తమోత్తమమైన బ్రహ్మచారులు. వారే శివునివద్ద జ్ఞానమర్థించి కూర్చుండి యుండిరి కదా! వారికన్న మిన్నగ వీడు తెలిసినవా డనుకొనుచున్నాడు. యోగీశ్వరుడగు కపిలుడు జ్ఞానావతారము. ప్రపంచములో ఈతని మించిన జ్ఞాని ఎచ్చట లభింపగలడు. ఈతని జ్ఞానము లోతును కనుగొనిన వాడెవరు? అట్టి కపిలుడే స్వయముగ వచ్చి శివుని చరణములందు తన శిరస్సు నుంచును. భగవానుని వద్ద నుపదేశమును గ్రహించును. ప్రపంచమున వున్న మునులు, ఋషులు, జ్ఞానులు, యోగులు, అవధూతలు, సన్యాసులు శివుని గమ్యములుగ భావింతురు. మనువులు, ప్రజాపతులు, మరి ఎందరో సృష్టి నిర్మాణమున కృషి చేయువారు శివుని పరివేష్ఠించి యుందురు. వారందరికన్న తాను మిన్న అనుకొనుచున్నాడు ఈ క్షత్రియాధముడు.

పార్వతీదేవి రోషావేశముతో కనులెఱ్ఱబడి చిత్రకేతువును వ్యంగ్యముగ సూటిగ నిందించు సందర్భమున ఇష్ట సఖియైన జయ మరల కల్పించుకొని “జగన్మాతా! ఇతడును నీ బిడ్డడే కదా! వీనిని క్షమించుము తల్లీ!” అని వేడుకొనెను. దానికి పార్వతీదేవి రోషముతో ఇట్లు పలికెను : “వీడు క్షమింపదగిన అపరాధము చేసియున్నచో క్షమించి యుండెడి దానిని, కాని మదముతో కన్ను మిన్ను గానక

శివుని దూషించి క్షమింపరాని అపరాధము చేసినాడు. మదించిన దురాత్ముడికి లోకమంతయు హేళనముగ కనుపించును. వీని మదము లోకేశుని కూడ హేళన చేయు దుర్గతి చెందినది. పుత్రుని దండింపవలెనని మాతృదేవి కెన్నడును యుండదు. వానిని ప్రేమింప వలెనని, ఆదరింపవలెనని, రక్షించుకొన వలెనని, వృద్ధి గావించవలెనని, ఎల్లప్పుడును ఆనందమున నుంచవలెనని కోరును. కాని బాలకునకు గారాబము హెచ్చై పరాకాష్ఠను చేరినచో పుత్రునకు భవిష్యత్తునందు కలుగు ఆపదను గ్రహించి కోపపడును. అవసరమగుచో తగిన విధమగు చికిత్స చేయును.

ఇతడు ప్రస్తుతమున మదమను రోగముచే పీడితుడై వున్నాడు. సమస్త లోక గురుని, అందున అందరి సముఖము నందును అవమానించినాడు. బాలుడని సదాశివు డుపేక్షించుట, ఆయన సహజస్థితి. నా పతి లోకములకే అతీతుడు. లోకమున ప్రకృతి ధర్మములను పాలించునది, శాసించునది నేనే. ఈతని శిక్షింపకున్నచో, దుర్గతి చెందగలడు. ఇప్పుడు వీనిని క్షమించినచో, ఇట్లెంతమందిని అవమానించునో? ఇట్టి అపరాధము గావించిన వానిని శిక్షింపకున్నచో కోటి కల్పముల వఱకు వీడు నరకాగ్నిలో పడగలడు. అంతియేకాక వీని ప్రవర్తనము దుష్టాచారములకు పునాది వేయగలదు. లోకహితము కోరి, నీచుడైన ఈ బిడ్డని హితమును కూడ కోరి నే నీతనిని ఇప్పుడే ఇక్కడనే శపించి, శిక్షించవలెను. అట్లు చేసినచో లోకములు, లోకులు

శివనింద వలన కలుగు విపత్తు తెలుసుకొని జాగ్రత్తగ నుందురు. అనంతుని దర్శన మగుటచే వీడు మదించినాడు. పూర్ణ సంస్కారము లేనివారికి దైవ దర్శనము, దైవానుగ్రహము, దైవముల వరము ఎంత దుర్గతికి దారితీయునో తెలుపుటకు ఈ దుర్మతియే ఉదాహరణము. దైవ మెన్నడును జీవుల ననుగ్రహించుటకే ఉత్సుకత చూపును. వీడు తమోగుణ ప్రధాను డగుటచే వీని కనంతు డందించిన దర్శనము వీనియందు వికటించినది. వీని శోకనివృత్తికై నారదు డందించిన ఉపాయము వీనిని తమము నుండి ఉద్ధరించిన మాట వాస్తవము. కాని తమో వాసన యింకను మిగిలియున్నది. కాన ఇతనిని రక్షించుకొనుటకు నేను శిక్షింపవలెను. వీనికి శాపమును అవశ్య మొసంగెదను.”

పార్వతీదేవి ఇట్లు పలుకుచుండగ సభాసదు లందరును నిర్ఘాంతపోయిరి. భయభ్రాంతులైరి. శిష్టుడగు ఈ విద్యాధరునకు ఏమి శాప మొసంగునో యని తత్తరపాటు చెందిరి.

## దేవి శాపము :

జగదంబిక చిత్రకేతు నుద్దేశించి ఇట్లనెను : “వత్సా! నీకేమి శాపము నొసంగుదునురా? నీవీ మాటలు అసుర భావమున పలికితివి. అసుర భావము వలననే నీ బుద్ధి విపరీతమైనది. కావున కొన్నాళ్ళు నీవు అసురుడుగ వుండుము. ఆసురీ యోనియందు జన్మింపుము. అపుడు నీవు నీ ఇష్టము వచ్చినట్లు దైవమును దేవతలను దూషింపవచ్చును, ద్వేషింపనూ వచ్చును. ఆ అసుర

జన్మను అనుభవించిన మీదట నీవు పరిశుద్ధుడ వయ్యెదవు. నీవు ఇంకను మహా పురుషులను నిందించుటకు ముందే ఈ జన్మ మంతమై అసుర జన్మను పొందెదవు. అటుపై ఇట్టి పాపముల కిక ఒడిగట్టుకొనక ఉద్ధరింప బడుదువు.

జగన్మాత అయిన పార్వతీదేవి శాపము నందలి అనుగ్రహము, ఆదరము, తల్లిప్రేమ గమనించిన సభాసదు లందరును "సాధు! సాధు!" అని పలికి ఆమోదించి ఆనందపడి ఆ తల్లిని కొనియాడిరి.

## స్థితప్రజ్ఞత్వము :

పార్వతీదేవి శాపమును విని చిత్రకేతువు విమానము దిగివచ్చి ఆమె పాదములపై పడి నమస్కరించెను. అచ్చట వున్న వారందరును చిత్రకేతువు భయపడినాడని, భయపడి పాదములపై పడినాడని భావించిరి. కాని చిత్రకేతువు భగవద్భక్తుడు. అనంత దర్శన మొందినవాడు. సృష్టి యందలి ద్వైతమును దాటినవాడు. నిజమైన భక్తుడు ప్రభువును మోక్షమును కోరడు. పుట్టుక చావులకు భయపడడు. అతడు కోరునది కేవలము అచంచలమగు భక్తి యొక్కటే. వేల కొలది, లక్షల కొలది జన్మలు కలిగినను, నికృష్ట యోనులందు పుట్టినను, పాతాళము నందు నరకము నందు వుండినను భగవత్ సాన్నిధ్యమును కోరును. అతనికి భగవత్ సాన్నిధ్యమే ముఖ్యము కాని తన స్థితిగతులు ముఖ్యము కాదు. ఎవరైన అనుగ్రహించినను శపించినను ఒక్కటియే.

చిత్రకేతువు ఇతరుల భ్రమ తొలగించుటకై జగజ్జననితో ఇట్లు పలికెను : "అమ్మా! నీ శాపమును సంతోషముగ స్వీకరించితిని. నీ ఒసగిన శాపము సఫలమగు కాక!" ఇది విని పార్వతీదేవి ఆశ్చర్యపడెను. శాపమును సహర్షముగ ఇంతవఱకు స్వీకరించిన వాడు నారదు డొక్కడే. దక్షుని శాపము అతనట్లు స్వీకరించినాడు. కాని ఇప్పుడు ప్రత్యక్షముగ విద్యాధర ప్రభువు తన శాపమును సంతోషముగ స్వీకరించుట గమనించి ఆశ్చర్యపడి ఇట్లనెను. "కుమారా! నీవు గొప్ప సాహసివి. వరములను సంతోషముగ స్వీకరించుటను నే ననేకములు చూచితిని కాని శాపము నింత సంతోషముతో స్వీకరించిన వానిని నేటి వఱకు చూడలేదు. నే నొసంగిన శాపమును ఎట్లు గ్రహించితివి? నీకు కష్టమే గావించితిని కదా?"

చిత్రకేతు విట్లనెను : "తల్లీ! పుత్రుడు కుపుత్రుడు కాగలడేమో కాని తల్లి మాత్రము కుమాత కాజాలదు. నీవు నీ సంతానమునకు కష్ట మొనర్పవు. నిజమునకు ఎవరును ఎవరికిని కష్టమును కాని, సుఖమును కాని కావింపరు. ఎవరును బుద్ధిపూర్వకముగ వరములను కాని, శాపములను కాని ఈయరు. పూర్వ జన్మమున ఎవడెట్టి కర్మ లొనర్చినాడో ప్రారబ్ధానుసారమున వానికి సరిపడు సుఖ దుఃఖములు లభించుచున్నవి. నాకేదో అట్టి కర్మ శేషించి యుండును. ఇందులో నీ దోష మేమున్నది. ఇతరుల వలన దుఃఖము కలిగిన దనుకొనుట, సుఖము కలిగిన దనుకొనుట అవివేకము. నా కష్టమునకు కారణము నా కర్మయే కాని నీ శాపము కాదు."

పార్వతి ఇట్లనెను : “అయినను శాపము శాపమే, వరము వరమే! నీకు నా శాపముచే దుఃఖము కలుగలేదా?”

చిత్రకేతువు గంభీరుడై ఇట్లు పలికెను : “నాకు దుఃఖ మన్నది కనబడుటనే కనబడుట లేదు. దుఃఖము సంసారమున కలుగును. సంసార మనగా సంసరణమే. సంసరణ మనగా తన నిజస్థితి నుండి జారుట. నిజస్థితి నుండి జారినవాడు త్రిగుణముల ప్రవాహమున పడును. ఆ ప్రవాహమున స్వర్గ-నరకములు, బంధ-మోక్షములు, సుఖ-దుఃఖములు, శాప-అనుగ్రహములు వచ్చిపోవు చుండును. జ్ఞాని వీనియందు చిక్కుపడడు. జీవులు మాయ కారణముగ తమయందు పాప పుణ్యముల నారోపించుకొని సుఖ దుఃఖములను అనుభవించు చుందురు. దీనిలో నాకు హితము కలదు, దీనిలో అహితము కలదు. ఇట్లు చేసినచో దుఃఖము కలుగును, అట్లు చేసినచో సుఖము కలుగును. ఇది బంధము, ఇది మోక్షము, ఇది జన్మ, ఇది మరణము అను భావములే సంసారమునకు కారణములు.”

అది విని పార్వతి ఇట్లనెను : “నీవు మంచి జ్ఞానివిగ కనపడుచున్నావు. భగవన్మాయను జయించినట్లు తోచుచున్నావు. అట్టి యెడ నా పాదములపై నేల పడినావు? నా వలన నీకేమి కావలయును?”

చిత్రకేతు విట్లనెను : "దేవీ! నేను నీ సముఖమున వినయముగ నుండుట భయము వలన కాదు. నిన్ను శాప పరిష్కారమునకై ప్రార్థించుట లేదు. శాప తీవ్రతను తగ్గించమని కూడ కోరుకొనుట లేదు. ఇట్టి శాపమును సహస్రముల కొలది లభించినను నేను విచలితుడను కాను. ఆసురీ జన్మము పొందుమని నీవు శపించితివి. అసురులలో భగవద్భక్తులు లేరా? యోని ఆవరణము మాత్రమే. హృదయమున భగవద్భక్తి యున్నచో, ఏ యోనియైన నేమి? నీ పాదముల నాశ్రయించుటకు కారణము, నే నాడిన మాట, నిన్ను బాధించినదే యని తెలిసి వినయ వినమ్రుడ నగుచున్నాను. నేనొక శిష్టాచారము ననుసరించి నా బుద్ధికి తోచిన సత్య విషయములను పలికితిని. దాని వలన నీకు దుఃఖము కలిగినచో, నేను, నా అభినయమునకు క్షమాపణమును వేడుచున్నాను. ఈ విషయమున నన్ను క్షమింపుము. శాప విషయమున నాకు లేశమాత్రమైన భయములేదు."

చిత్రకేతువు ఈ విధముగ పలికి పార్వతీ పరమేశ్వరుల పాదములకు ప్రణామము గావించి వారి ప్రత్యుత్తరములకై వీక్షింపక తన విమాన మెక్కి వెడలెను. సభలోని మునులు, ఋషులు, మహర్షులు ఆశ్చర్య చకితులైరి. "ఆహా! ఈ విద్యాధరుడు ఎంత దృఢనిష్ఠ కలవాడు. ఎంతటి స్థితప్రజ్ఞుడు. అనంతుని ఉపాసనా ప్రభావమున ఈతడు దుష్కరమగు మాయను దాటినట్లున్నది. ఇంతటి శాపమునకు కూడ చలింపలేదు." అని భావించిరి.

9

# శివుని భక్తప్రశంస

**చి**త్రకేతువు యొక్క దృఢనిష్ఠ, సమత్వబుద్ధి, ద్వంద్వాతీత స్థితి, పార్వతీదేవిని ఆశ్చర్యపరచినవి. అంతర్యామియగు పరమ శివుని శ్రీముఖమును ఆశ్చర్య చకితయై చూచుచు నుండెను. ఆమె మనోభావమును గ్రహించి, పరమశివుడు ఈ విధముగ చెప్పెను. "దేవీ! ఈతడు భగవద్భక్తుడు. భగవంతునికంటె అధికులగు భక్తుల కోవకు చెందినవాడు. ఇతడు భక్తులకు భక్తుడు. దాసులకు దాసుడు. భగవంతునికన్న అధికులగు అంగిరస, నారదమునుల చరణసేవ కావించినటువంటి వాడు. నారద అంగిరసులు భగవంతునిచే నిత్యము మెచ్చుకొనబడు భక్తులగుటచే వారు అధికులని పేర్కొను చున్నాను. వారి ఉపదేశ మార్గమున నిరంతర సాధనను గావించి, ఈ చిత్రకేతువు అనంత దర్శనమును పొందినాడు. అంతియేకాక, అనంతుని అనుగ్రహమును కూడ పొందినాడు. భగవంతుని అనంత తత్త్వము సమస్త లోకములను వ్యాపించి యుండును కదా! అంతియేకాక, ఆ లోకములను అధిరోహించి కూడ ఉండును. అట్టి అనంతత్త్వ దర్శనము, అనుగ్రహము పొందిన చిత్రకేతువునకు స్వర్గ

నరకముల భేదముండదు. ఎట్టి భయము, దుఃఖమూ లేక భగవంతుని ఆశ్రయించి యుండును. అట్టివారు భగవంతునికి భయపడరు. భగవంతునైనను నిర్మొగమాటముగ ప్రశ్నించగలరు. అట్టి స్థితి ఇట్టివారికి భగవంతు డందించు చనువే. ఈ కోవలోనికి చెందిన భక్తుల భావము లిట్లుండును :

"మాకు ముక్తి అక్కరలేదు. మాకు బంధముక్తుల యందు భేదబుద్ధి యుండినచో, బంధమును వదలి ముక్తిని గ్రహింపవచ్చును. కాని, మాకట్లు కాదు. మాకు బంధముక్తులు రెండునూ ఒక్కటే. శాపానుగ్రహములు రెండునూ ఒక్కటియే. జన్మలుండిన ఉండనిండు. నరకమునకు పోవలసినచో పోయెదము." భగవంతుడు సైతము ఇట్టి భక్తుల వశమున నుండును. వారి యెడల ఎట్టి అపరాధమూ సంభవించుట నాతడు సహింపడు. గుర్తుంచుకొనుము. భగవంతుడు భక్తులకు భృత్యుడు. అనగా భృత్యులకు భృత్యుడు. భక్తులు భగవంతునకు భృత్యులు. భగవంతుడు భక్తులకు భృత్యుడు. సనాతన ధర్మమున గురుశిష్య సాంప్రదాయమిట్లే యుండును. శిష్యునకు గురువెంత భృత్యుడో, గురువు కూడ శిష్యునకు అంత భృత్యుడుగ నుండును."

**గురువు-ప్రభువు :**

"నీవు తాత్కాలికముగ కోపము చెంది, రాజర్షియగు చిత్రకేతువును శపించితివి. ఆతడు సామర్థ్యము కలవాడు. తలచుకొనినచో మరల నిన్ను శపింపగలడు. కాని అతడట్లు చేయక,

నీ కనునయ వినయములు కావించినాడు. కారణ మేమన నీవు నా సహధర్మచారిణివి. నేను పరిపూర్ణ వైష్ణవుడను. **వైష్ణవులు ఇతరుల దోషములను చింతింపనైన చింతింపరు. ఇతరుల దోషములు ప్రత్యక్షముగ కనపడుచున్నను, తాము చింతింపరు. ఎవరికినీ చెప్పరు సరికదా సమర్థింతురు. నిజమైన వైష్ణవుడు ఆచార్యుడు కాని, అధికారి కాడు.** అధికారికి శిక్షించు కర్తవ్యము, దండనమును విధించు కర్తవ్యము కలదు. కావున దోషములు చూడవచ్చును. అది పాలనా ధర్మము. ఆచార్య ధర్మము అట్లుకాక, అందరి యందలి అంతర్యామిని దర్శనము చేయుచు జీవులను ప్రోత్సహించుచుండుటయే ఉండునుగాని, తప్పులెన్నుట ఉండదు. ఈ ప్రోత్సాహము దోషములను కాక, వ్యక్తులను ధర్మమార్గము నందుంచుటకు ఈయబడు ప్రోత్సాహము. ఆచార్యుని పదవి అత్యున్నత పదవి. అధికార పదవి దానికి లోబడి యుండును. సంఘమున దొంగలను పరిపాలకులు శిక్షింతురు. అది వారి కర్తవ్యము. అంత మాత్రమున శిక్ష ననుభవించిన దొంగ పరివర్తనము చెందుట లేదు. కాని, అదియే దొంగ ఆచార్యుని సముఖమున పరివర్తనము చెందిన దృష్టాంతము లెన్నియో కలవు. పాలకుడు సంఘ సంస్కరణము చేయుచుండును కాని, సంస్కారము లేనివారు చాటుమాటుగా సంఘ సంస్కరణములను ఉల్లంఘించుచునే యుందురు. భగవద్భక్తు లట్లుకాక, తమ్ము తాము నియమించుకొను చుందురు. సంస్కరించుకొను చుందురు. ఇట్లందరూ తమ్ము తాము సంస్కరించుకొన్నచో పాలకవర్గమే అవసర ముండదు. భక్తుడు తన

హృదయముపై చేయి వేసికొని తన మనస్సు తన వశమున నున్నది లేనిదీ నిరంతరము గమనించుకొను చుండును.

**దైవికము :**

"ఓ పార్వతీ! భక్తుల దృష్టిలో ద్వైతము ఉండనే ఉండదు. వారు సర్వత్ర సర్వ వ్యాపకుడగు స్వామినే చూచుచుందురు. కావున నీ వొసంగిన శాపము అతడు అంతర్యామి అనుగ్రహముగ స్వీకరించెను గాని, శాపమని భావింపలేదు. నిజమునకు నీనుండి అంతర్యామియే జగత్కళ్యాణము కొరకై ఈ కార్యము నొనర్చినాడు. జగన్నాటక సూత్రధారియగు భగవంతునకు ఇష్టులెవరో అయిష్టు లెవరో తెలుసుకొనుట సులభ సాధ్యము కాదు. బ్రహ్మదేవుడు కూడ అతని వ్యూహ రచనను అప్పుడప్పుడు అవగాహన చేసుకొనలేక తికమక పడుచుండును. మహాభక్తుడైన చిత్రకేతువు అసురీ యోనియందు జన్మించుట జగత్కళ్యాణమునకే కావున నీవు చింతింప పనిలేదు. నీవును విష్ణువునకు ప్రియ సోదరివి అగుటచే నిన్ను వాహికగా దైవమీ కార్య మొనర్చినాడు. దైవ కార్యమునకు నీవు సహకరించితివి. నిజమునకు దైవమొక దేహమున నుండక, దైవభక్తుల రూపమున వ్యక్తమగుచుండును కదా! జగన్మోహనుడు నీకు తాత్కాలికముగ మోహము కల్గించి తన కార్యమును నెరవేర్చుకొనినాడు. అతని వ్యూహ రచన భవిష్యత్తున తెలియగలదు. నీ శాపము లోకమునకు వరముగ ప్రాప్తించినదని తెలిసి ఊరడిల్లుము."

10

.......................................................................

# ఇంద్రుని అహంకారము

ఇంద్రుని దురహంకారము, అది కారణముగ అతని కేర్పడిన దుష్ప్రవర్తనము, విష్ణు భక్తుడైన చిత్రకేతువు యొక్క పునర్జన్మమునకు కారణమైనవి. ఇంద్రుడు గర్వించి, సద్గురువుల నవమానించి, బ్రహ్మహత్యకు కూడ వెనుదీయని దుష్ప్రవర్తనము చూపుటచే అతనిని ధర్మమున నిలబెట్టుటకు 'వృత్రునిగ' చిత్రకేతువు అవతరింపవలసి వచ్చెను. అది ఎట్లనిన :

మూడు లోకములపై ఇంద్రునకు కలిగిన విజయమును సంబరముగ నిర్వర్తించుటకు ఒక ఉత్సవ మేర్పాటు చేయబడినది. ఇంద్రుడు కేంద్రముగ ఏర్పడిన ఆ సభలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, దేవతలు, సిద్ధులు, ఇత్యాదు లందరు కొలువై యుండిరి. అప్సరసలు నృత్యము, గానము చేసిరి. అందరును వేనోళ్ళ ఇంద్రుని పొగడిరి. నాడు పూర్ణిమ యగుటచే చంద్రుని వెన్నెల ఉత్సవ సంరంభమును ఇనుమడింప జేసినది. ఆ దివ్య వైభవమునకు తన విజయమే కారణమని ఇంద్రుడు ఉబ్బి,

గర్వముతో నిండి, ఉన్నతాసనమున ఆనందముగ నుండెను. అట్టి కొలువు లోనికి సాక్షాత్ మూర్తీభవించిన పరబ్రహ్మము, బృహస్పతి ఏతెంచినాడు. అతడు దేవత లందరికిని, ఇంద్రునకును కూడ గురువు. సభకు ఏతెంచుచున్న గురుమూర్తిని దర్శించియు విజయ గర్వముతో ఇంద్రుడు లేవక, నమస్కరింపక, ఎదురేగక కూర్చుండినాడు. కనీసము బృహస్పతికి ఆసనము కూడ చూపలేదు. అహంకారము ఎట్టివానినైనను పతనము గావింప గలదు. ఇంద్రుని కప్పిన గర్వమను పొరను గమనించి బృహస్పతి జాలిపడినాడు. శిష్యునకు గర్వము వలన కలుగు పతనమును గ్రహించి లోపల దుఃఖపడినాడు. కొలువునుండి హుటాహుటిని తన నివాసమున కేగినాడు.

సంరంభములైన పిమ్మట ఇంద్రుని అంతశ్చేతన తాను చేసిన పొరపాటును గమనింప జేసినది. తనకు కలిగిన గర్వమను పొర తన గురువును కూడ నిర్లక్ష్యము చేసినది. ఆహా! గర్వ మెంతపని చేయించగలదు? గురువును కూడ అవమానించితిని కదా! అని బాధపడెను, భయపడెను. తన గురువు దేవతలచేత కూడ పూజింపబడువాడు. పరమ పవిత్రుడు. సాత్వికులలో ఉత్తముడు. తాను చేసిన భ్రష్టాచారపు ప్రవర్తనను మౌనముగా భరించి వెడలిపోయినాడు. తన ప్రవర్తనను ఖండించుటకు, తనను శాసించుటకు, శపించుటకును కూడ అతడి కధికారము కలదు. కాని అతడట్లు చేయలేదు. ఎంతటి ప్రశాంతచిత్తుడు? అట్టి వానిని అవమానించితినా? అని కుమిలినాడు. అధికార మదముచే తానెంత

కుసంస్కారమును ప్రదర్శించినాడో తెలిసి, హుటాహుటిని బృహస్పతి నివాసమున కేగినాడు. అతనిని క్షమాభిక్ష వేడవలెనని హృదయము పరితపించినది. గురు నివాసమున కేగి, గురువుకై వెదకినాడు. బృహస్పతి కనబడలేదు. అనగా ఇంద్రునకు కనబడలేదు. ఇంద్రునకు గురువట్లు అదృశ్యుడైనాడు. ఎంత పరిశీలించినను, గురుదర్శనము కాలేదు. చిన్నబోయి తల వంచుకొనెను. గురువు అనుగ్రహమును కోల్పోయిన ఇంద్రుడు దీనుడై నిలచినాడు. ఇది గమనించి అసురులు విజృంభించిరి. దేవతలను చెల్లాచెదరు చేసిరి. ఇంద్రునితోసహా దేవతలందరును యుద్ధమున అసురుల నెదుర్కొనలేక పారిపోయి, బ్రహ్మదేవుని ఆశ్రయించిరి. బ్రహ్మ వారి కభయమిచ్చి, విశ్రాంతి కలిగించి, ఇట్లని తెలిపెను :

"ఇంద్రా! ఏమని చెప్పుదును? నీవు చేయకూడని పని చేసితివి. చిన్నతనము నుండి నీ శ్రేయస్సునే అభిలషించుచు బుద్ధులు గరపిన గురువునే అవమానించితివి. అతడు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే! నీకు సామర్థ్య మేర్పరచి, తన సాన్నిధ్యమును కూడ నీకిచ్చుటచే నీవు విజయ పరంపరలతో మూడు లోకములకు అధిపతివైతివి. కేవలము పరమ ప్రేమతో నిన్నింత వానిని చేసెను కదా! నీనుంచి ఏమియును ఆశించనూ లేదు. బృహస్పతి సమస్త వేద రహస్యములూ తెలిసినవాడు. అతనిని నీ వవమానించితివి. అతడు నీ కొలువున కేతెంచినపుడు శరీరమంతయు క్రొవ్వెక్కి యుండుటచే నీ తల వంగలేదు. కాళ్ళు ఎదురేగలేదు. చేతులు

కనీసము నమస్కరింపనుకూడ లేదు. అది కారణముగ నీ క్షేమ మంతయు అదృశ్యమైనది. అతడు నీకు ప్రస్తుతము కనపడుట కూడ లేదు. నీ ప్రవర్తనము నందలి దోషము నిన్ను బలహీనపరచినది. అంతియే కాదు. అది అసురులను బలపరచినది. **నీకన్న బలహీనులగు అసురులు నీకన్న బలవంతులై నిన్ను గెలుచుటకు కారణము గురువు ఎడల నీవు చూపిన దుష్ప్రవర్తనమే.**

"రాక్షసులు బలవంతులగుటకు మరియొక కారణ మున్నది. వారు తమ గురువైన శుక్రాచార్యుని గౌరవించి, అతని రహస్యోపదేశము పొందుచున్నారు. నీవా గురువు అనుగ్రహమును చేజార్చుకొనిన వాడవు. వారు గురువు అనుగ్రహమును అమితముగ పొంది యున్నవారు. రాక్షసులు సహజముగ మదము, పొగరు కలవారు. కాని, వారి గురువు ఎడల ఎన్నడును వాటిని ప్రదర్శింపలేదు. వారి హితము కోరి చెప్పిన దానిని వారెప్పుడును నిర్లక్ష్యము చేయలేదు కనుకనే గురువును ధిక్కరించిన నిన్ను యుద్ధమున గడ్డిపోచవలె పరాభవించినారు."

ఇంద్రుడు పశ్చాత్తప్తుడై బ్రహ్మకు నమస్కరించి తాను చేసిన పొరపాటును మన్నింపమని, తనకు దారి చూపమని ప్రార్థించెను. అపుడు బ్రహ్మదేవు డిట్లనెను :

"ఇపుడు మీ కందరకును కావలసినది గురు కృప. ప్రస్తుతమున బృహస్పతి మీ కందుబాటులో లేదు. త్వష్ట ప్రజాపతి

కుమారుడు విశ్వరూపుడు నిశ్చలతత్త్వము కలవాడు. ఎప్పుడును తపస్సు చేసుకొనుచుండును. అతని నారాధింపుడు. మీకు కావలసిన సమస్తమును అతడు సాధించి పెట్టగలడు. మీ దుర్గతి నుండి అతడే మిమ్ములను కాపాడగలడు."

బ్రహ్మదేవుని ఆదేశానుసారము దేవతలు విశ్వరూప మహర్షిని ఆశ్రయించిరి. అతనిని స్తుతించిరి. శ్లాఘించిరి. విశ్వరూపుడు తపస్సమాధి నుండి మేల్కాంచి దేవతలను, దేవేంద్రుని పరికించెను. అప్పుడు దేవేంద్రుడు చేతులు జోడించి, "స్వామీ! నీవు మా తండ్రివంటి వాడవు. మా కార్యము సానుకూలమగుటకై నిన్నాశ్రయించు చున్నాము. మేము నీ తండ్రియగు త్వష్ట సోదర వర్గములోని వారము. నీకు తండ్రివంటి వారమే అయినను గుణముల చేత గొప్పవాడవైన నిన్ను సేవించుటకన్న శ్రేయోదాయకము మా కేమియు లేదు. నీవు భగవంతుని విశ్వమందలి రూపము లన్నిటిని మరియు విశ్వరూపమును కూడ భగవంతునిగ ఆరాధించి, సాక్షాత్తు విశ్వరూపుడవై నిలచి యున్నావు. ఇది కారణముగ మా కందరికిని గురు స్థానమున నున్నావు. గురువనగా పరమాత్మ స్వరూపుడు. తండ్రి బ్రహ్మ స్వరూపుడు. అన్నగారు ఇంద్రుని ప్రతిరూపుడు. చెల్లెలు మన దయకు మరియొక రూపము. తల్లి భూదేవి రూపము. అతిథి అగ్నిదేవుని రూపము. సర్వజీవులును నారాయణుని రూపములు. తనకు తానుగ జీవుడు యాచకరూపము. మేము గురువు అనుగ్రహము కోల్పోయి,

పదభ్రష్టులమై ఉన్నాము. నీ అనుగ్రహమున నీ తేజస్సు కారణముగ శత్రువులను జయించ కోరుచున్నాము.”

“నీవు మాకన్న చిన్నవాడవు. నీకు మేము నమస్కరించ వచ్చునా? అని నీవు తలచెదవేమో! నీనుండి ప్రయోజనమును కోరి వచ్చినవారము కనుక నీ కన్న చిన్నవారమే. మమ్మనుగ్రహింపుము.”

## విశ్వరూపుని మనోగతము :

ఈ విధముగ ఇంద్రుడు, దేవతలు ప్రార్థింప, విశ్వరూపుడు తనలో ఇట్లు భావించినాడు. నోరెత్తి పెద్దలు ప్రార్థించినారు, స్తుతించినారు. వానిని విని పొంగినచో బ్రహ్మతేజస్సు తొలగిపోవును. దేవతలు తనను ప్రార్థించుట యేల? ఈ విశ్వమున ప్రార్థించుటకు అర్హుడు విష్ణువొక్కడే! ఎవరిని కీర్తించినను వాని గుణకీర్తనమే జరుగుచున్నది. దైవస్తుతి ఒక్కటే సమంజసము. ఇతరులలోని గుణములు స్తుతింప బడినప్పుడు అది దైవస్తుతిగ భావింపవలెను. అటులనే స్తుతించువారు కూడ, స్తుతింపబడు వానిలోని దైవమునే ఉద్దేశించి స్తుతింపవలెను గాని, వ్యక్తిని కాదు. అట్లుకాక **వ్యక్తిని స్తుతించువారు ఎంత పెద్దవారైనను, ఏదియో ఒక స్వార్థ ప్రయోజనమునకై స్తుతించు చున్నారని తెలియవలెను.** స్తుతింపబడువారు కూడ ఎదుటివారు తనలోని దైవమును స్తుతించు చున్నారుకాని, తనను కాదని తెలియవలెను. వీరి మాటలకు పొంగి, మెత్తబడి వీరికి

గురువుగా దక్షిణల పేర ధనమును పోగేసుకొనుట, వీరు చెప్పిన ప్రకారము నడచుకొనుట భ్రష్టమార్గ మగును. గురువుల శిక్షణము ప్రకారము నడచుకొని, వారిచ్చిన రహస్యములను స్వీకరించి, **ధర్మ మార్గము ననుసరించు శిష్యులు కావలెను కాని, ధనమిచ్చు శిష్యులు కాదు.** అట్టి సుశిక్షితులగు శిష్యులున్నచో వారే కూడబెట్టిన ధనము. ఈ ఇంద్రుడు సమస్తమును పోగొట్టుకొనుటచే పోగొట్టుకొనిన దానిని పొందుటకు నా దగ్గరకు వచ్చినాడు. ఏమియు లేనివాడైనను, ధర్మము నాశ్రయించిన వాడైనచో పొలములో కుప్పనూర్పిడి అయినచోట్ల కళ్ళెములలో చెదిరిపడియున్న గింజలను ప్రోగుచేసుకొని, జీవించ వచ్చును కాని, నీచమగు యాచకవృత్తికి దిగవచ్చునా? అట్లు జీవించుట తెలిసినవానికి సమస్త కార్యములు నెరవేరగలవు. ఏది ఏమైనను కాలపురుషుడు తనకు ఇపుడీ పెద్దల యెడల పురోహితవృత్తి నేర్పరచినాడు. తనకు పెద్దలు మరియు తండ్రులు. కాదనుటకు వీలులేదు. ఇట్లు తలచి విశ్వరూపుడు వారి కభయము నిచ్చెను.

శుక్రాచార్యుని రహస్య విద్యలకన్న రెట్టింపు విద్యలను దేవతలకు సాధించిపెట్టి, విశ్వరూపుడు ఇంద్రుని మరల గెలిపించెను. ఆ విద్యయే విష్ణుమాయా రహస్యము. దీనిని ఇంద్రున కుపదేశించుటచే ఇంద్రుడు బలవంతుడై రాక్షసులను గెలిచెను. ఈ విష్ణుమాయా రహస్యమునే 'నారాయణ కవచ'మని కూడ తెలుపుదురు. దీని మహిమ ఇంత యని ఊహించుటకు వీలులేదు. (నారాయణ కవచ

వివరణము, మాస్టర్ ఇ.కె. చే రచింపబడిన శ్రీమద్భాగవతము 15వ భాగమునందు చూడగలరు.) విశ్వరూపుని వలన ఇట్టి విద్యను ధరించి, ఇంద్రుడు మూడు లోకముల సంపదకు అధిపతి అయ్యెను. తన కోర్కెను గురు ముఖముగ సాధించుకొన్న వాడేగాని, ఇంద్రునికి ఇంకను గురువనుగ్రహము దక్కలేదు. గురువు కనబడుట లేదే అన్న చింతకన్న త్రిలోకాధిపత్యము పోయినది కదా అను చింత ఎక్కువగ నుండి విశ్వరూపుని ఆశ్రయించినాడు కనుక రాజ్యాధిపత్యము లభించినది కాని గురు ప్రసాదము లభించలేదు.

**ఇంద్రుని అజ్ఞానము :**

విజయ గర్వముతో ఇంద్రుడు తన గురువగు విశ్వరూపుని వద్ద కేగెను. విశ్వరూపునకు మూడు తల లున్నవి. అందు ఒకటి సోమరసమును త్రాగుచుండును. రెండవది కల్లు త్రాగుచుండును. మూడవది అన్నము తినుచుండును. విశ్వరూపుడు దేవతలతో కలసి యజ్ఞభాగమును ప్రత్యక్షముగ స్వీకరించి తన మూడు తలలనుండి దేవతలకు, మానవులకు, రాక్షసులకు ఆహారము పంచి యిచ్చు చుండును. విశ్వరూపుడు రాక్షసులకు కూడ దేవతా యజ్ఞము నుండి భాగము పంచియిచ్చుట ఇంద్రునికి నచ్చలేదు. తనకు ద్రోహము కలిగించు చున్నాడని, గురువని కూడ భావింపక, ఇంద్రుడు విశ్వరూపుని మూడు తలలను ఖండించెను. ఇంద్రుడు మరల గురువు ఎడల అపచారము కావించెను. బృహస్పతి నవమానించెను.

దానికి ప్రతిఫలముగ రాక్షసులచే పరాజితుడయ్యెను. విశ్వరూపుని సంహరించెను. దానికి ప్రతిఫలముగ బ్రహ్మాహత్యా పాతకమును పొందెను. అహంకార పూరితుడగు జీవుడు, కన్నుమిన్ను గానక సత్యము తెలియలేక ఇట్టి అపరాధమును చేయుచుండుట వింత కాదు. విశ్వరూపుడు గురువుగ దర్శనమిచ్చిన అంతర్యామి ప్రజ్ఞ. అంతర్యామి సృష్టియజ్ఞమున కాధారభూతుడు. దేవతలు అతనిని యజ్ఞమున ఆహుతి చేయుట వలన సమస్త సృష్టికోటి ఏర్పడుచుండును. రాక్షసులు కూడ అట్లు పుట్టినవారే. వారికిని సృష్టి నిర్వహణమున కొంత పని యున్నది. అందరిని పోషించినట్లే వారిని కూడ అంతర్యామి పోషించుచుండును. కప్పను పోషించినవాడు పామును కూడ పోషించును. జీవులలో పరస్పర విరుద్ధమగు స్వభావము లుండును కాని అంతర్యామి యందవి వుండవు. దేవాలయమునకు దొంగ, దొర ఇద్దరును పోవుదురు. వారి వారి అభీష్టములకై ప్రార్థింతురు. జీవులకును వారి వారి కర్మానుసారము దైవము అభీష్టములను నెరవేర్చుచుండును. గురువును అట్లే. **పక్షపాత బుద్ధి యున్నవాడు సద్గురువు కానేరడు.** ఇట్టి అంతర్యామి తత్త్వమును, గురు తత్త్వమును గ్రహింపలేక ఇంద్రుడు విశ్వరూపుని హతమార్చెను.

**బ్రహ్మాహత్య :**

తెగిన మూడు తలల నుండి మూడు పక్షులు ఉత్పన్నమై, బ్రహ్మాహత్య చేసితివని అరచుచు, ఇంద్రుని చుట్టును తిరుగాడినవి.

మూడు లోకములకు నాయకుడైనను బ్రహ్మహత్యా దోషము నుండి తప్పించుకొనలేక, ఆ మహాదోషమును స్వీకరించెను. ఒక సంవత్సర మా దోషమును అనుభవించి దానిని విసర్జించుటకు భూమిని, జలములను, వృక్షములను, స్త్రీలను ప్రార్థించెను. తన దోషమును నాలుగు భాగములుగ చేసి స్వీకరింపుడని, వారిని ప్రార్థించెను. వారు నలుగురును ఇంద్రుని ప్రార్థనల నంగీకరించి బ్రహ్మహత్యా దోషము నందుకొనిరి. అది కారణముగ భూమికి బ్రద్దలగుట, పఱ్ఱ లేర్పడుట అను స్వభావము కలిగెను. జలములకు నురుగు, మడ్డి ఏర్పడుట స్వభావముగ నిలచెను. వృక్షములకు పసరు, బంక ఏర్పడు స్వభావము కలిగెను. స్త్రీలకు ఋతుకాల మేర్పడెను. ఋతు కాలమున స్త్రీలు, వృక్షముల యందలి బంక, పసరు, నీటి నురుగు, చవిటి నేల, పై కారణముగ అస్పృస్యములుగ ఏర్పడినవి. ఇది ఆర్య సాంప్రదాయము. దీనిని మన్నించుట సత్పురుషుల లక్షణము.

పై దోషముల నంగీకరించుటచే, ఇంద్రుడు నలుగురికిని నాలుగు వరములు కూడ నందించినాడు. కామము నుండి సుఖము పొందు వరము స్త్రీల కందించినాడు. త్రెంపినను, త్రుంచినను మరల చిగురించు వరము వృక్షము కందించినాడు. సమస్తమును క్షాళనము చేయు వరము జలముల కందించినాడు. త్రవ్వబడిన గోతులు మరల కాలక్రమమున పూడుట యను వరము భూమి కందించినాడు.

11

........................................................................................................

# వృత్రుని ఆవిర్భావము

ఇట్లు బ్రహ్మహత్యా పాతకమును, నలుగురికీ పంచి వారికి వరము లిచ్చి తాను రక్షింపబడెనని ఇంద్రుడు భావించుచు, త్రిలోకాధిపత్యమును నిర్వహించుచు ప్రశాంత చిత్తుడయ్యెను. కాని అతడు చేసిన ఘోరకర్మము అతనిని వీడలేదు. విశ్వరూపుని మరణమునకు దుఃఖితుడై విశ్వరూపుని తండ్రి త్వష్ట, భీషణ రోషముతో ఇంద్రుని గూర్చి ఒక మారణ హోమము చేసెను. ఆ హోమాగ్ని నుండి ఒక మహా స్వరూప ముదయించినది. ఆ రూపము అగ్నిజ్వాలల వంటి చూపు గలది. ప్రళయ కాలమున సమస్తమును తనలోనికి హరింపు చేసుకొనగల పెద్ద నోరు గలదై ఇంద్రుని మ్రింగుటకు స్వర్గము వైపునకు నడచెను. అతడే వృత్రుడు. (పార్వతీదేవి శాప వశమున జన్మనందిన విద్యాధర ప్రభువు, చిత్రకేతుడు. దేవి శాపమీ విధముగ జగత్కల్యాణమునకు తోడ్పడినది. శివుని వాక్యములు సత్యమై నిలచినవి.)

వృత్రాసురుడు దినదిన ప్రవర్ధమాను డగుచు అరుణము, పసిమి కలగలిపిన సంధ్యా కాంతివలె ఒప్పారు చుండెను. అతని

దేహము దినము కొక అమ్ముమేటి దూరమున పెరుగుచు భీకరరూపము దాల్చినది. అతని కన్నుల కాంతి సూర్యబింబములను మరపింపజేయు నట్లున్నది. అతడు భూమ్యాకాశముల నడుమ ఒక మహాకారమై జ్వాలా స్వరూపుడుగ నేర్పడెను. అతడు వాడియైన శూలమును పట్టుకొని, గుండ్రముగ త్రిప్పుచుండగా ఆ శూలమునుండి వెలువడుచున్న కాంతులు దేవతలను సైతము భయభ్రాంతులను చేయుచున్నవి. దేవతలు రోషపడి అతనిని చుట్టుముట్టి మహాస్త్రములను ప్రయోగించిరి. అతడు నోరు తెరువగా ఆకాశమును మ్రింగుచున్నట్లు వుండెను. అట్లు నోరు తెరచి దేవతాశ్వముల నన్నిటిని మ్రింగి భక్షించుచు ఉత్సాహముగ విరుగబడి నవ్వుచు దేవతల వెంటపడెను.

ఇంద్రుడు (మనసు) చేసిన అత్యాచారము కారణముగ అతనిని బంధించు మరియు హింసించు శక్తి పుట్టినది. ఎవడైనను **ధర్మగ్లాని కలిగించినపుడు ఆ కార్యము నుండియే రాక్షస శక్తులు ఉద్భవించి వానిని హింసించ గలవను** సృష్టిధర్మము ఇచ్చుట స్పష్టముగ తెలియుచున్నది. క్రమశః మనసు రాక్షస వశమై తనను తాను హింసించుకొను స్థితి ఏర్పడగలదు. అట్టి స్థితిలో దేవతా ప్రజ్ఞలు బలహీనపడుట జరుగును. అదియే ప్రస్తుతము దేవతలు పరాజితు లగుటగా తెలియవలెను. అట్టి స్థితిలో దైవము తప్ప తోడ్పడగలవా డెవ్వడును లేడు. ఇట్లు భావన చేసి దేవతలు నారాయణుని జేరి, అతనిని త్రికరణశుద్ధిగ పూజించిరి. అతని రక్షణ

వేడిరి. అంతర్యామియగు నారాయణుడు ప్రీతి పొంది, దేవతలతో నిట్లనెను :

**నారాయణ ధ్యాన రహస్యము :**

"నన్ను ధ్యానించుటలో ఒక విశేష మార్గమున్నది. ధ్యానించువాడు, తనను నా యందు సమర్పించుకొని నేను తప్ప మరియొకడు లేని ఏకాంత స్థితిని అనుభవించును. అతడే సత్యము తెలిసినవాడు. అత డేదియును కోరడు." ఇట్లు భావగర్భితముగ పలికిన నారాయణుని పలుకులు దేవతల కవగతము కాలేదు. రక్షణ కోరినవాడు రక్షకుని యందు సమర్పణము చెందుటచే రక్షణము సహజముగ ఏర్పడును. అట్టివాడు ఏకాంతుడై సమస్తమును తానుగనే దర్శించును. అనగా వృత్రుని సైతము తానుగ దర్శించును. (బంధించుచున్న సన్నివేశములను సైతము భగవంతునిగ చూచుట ఇచ్చుట చెప్పబడినది.)

అవగాహన లేమితో దేవతలు రక్షణకై యాచించుటను గమనించి నారాయణుడు వారితో ఇట్లనెను : "దధీచి యను ఋషి కలడు. అతడు ఉత్తములలో ఉత్తముడు. యాచించిన వారికి తనను కూడ సమర్పించుకొనగలడు. అతనియందు సమర్పణవిద్య, అంతర్యామి ఆరాధనవిద్య అతిశయించి యున్నవి. మీరతని దేహమును యాచించుడు. అతడు సంకోచింపక మీకు తన దేహము నిచ్చును. అతని దేహమునందలి ఎముకలను కలిపిన నూరంచులు గల

శ్రేష్ఠమగు నొక ఆయుధ మేర్పడును. ఆయుధమునకు మూలముగ అతని వెన్నెముక ఉండును. అది నా తేజస్సుతో నిండియున్నది. దానిని ఆయుధముగా గొని మీరు వృత్రాసురుని సంహరింప వచ్చును. మీకు శుభమగు గాక!" అని తెలిపి నారాయణు డదృశ్యుడయ్యెను.

## ఇంద్రుని యాచన : దధీచి

దేవతలు అత్యంత దీనస్థితికి పతనము చెందుటచే రక్షణ కొరకు ఉచ్చనీచములను కూడ తలంపక, అతని దేహమును యాచించుటకు సిద్ధపడిరి. సృష్టి వైభవమును అనుభవించుటకే కదా దేహ మీయబడినది! అట్టి దేహమునందు చాల కాలము సుఖపడిన తరువాత కూడ ఎవ్వడును బుద్ధిపూర్వకముగ దేహమును విడువలేడు. దేవతలు తమ దేహముల సంరక్షణార్థమై దధీచి దేహమును కోరుట యాచకుని దుస్థితిని తెలుపుచున్నది. ఇతరుల ధనమును కోరవచ్చును. పలుకుబడిని కోరవచ్చును. విద్యను కోరవచ్చును కాని దేహమును దానముగ కోరు వృత్తాంతము ఎందును కానరాదు. యాచించుట నీచమని తెలిసియు, యాచించబడు వస్తువు యాచింపరానిదని కూడ తెలిసియు, దధీచి దేహమును యాచించుటకు ఇంద్రాది దేవతలు సంసిద్ధులైరి.

దధీచి మహర్షి మహా మహిమాన్వితుడు. అతడు అశ్వినీ దేవతలకు కూడా గురువు. బ్రహ్మవిద్యా స్వరూపమైన అశ్వ శిరస్సు

అను విద్యను అశ్వినీ దేవతల కుపదేశించినవాడు. ఆ దేవతలు ఆ విద్య నుపాసించి నిర్మలమూర్తులై జీవించి యుండియు మోక్షము నందుందురు. ఆ విద్యను పొందినవా రెవరైనను శాశ్వతముగ మముక్షువులై యుందురు. **శిరస్సు నుండి దిగువగా వెన్నెముక ఆధారముగ మనలో వున్న ప్రాణమును ధ్యానముచేయు విద్యయే అశ్వవిద్య.** వేదములందు ప్రాణమును అశ్వమందురు. ప్రాణము దేహమున కాధారము. ఈశ్వరుడు ప్రణవ స్వరూపుడై ప్రాణమను అశ్వము నెక్కి తిరుగుచున్నట్లు వేదములు వర్ణించు చున్నవి. శిరస్సులో ప్రాణమయ కోశమునకు గల ప్రారంభ స్థానమును ధ్యానించుచు వెన్నెముక వెంటవున్న నాడీ మండలమును ఈ ప్రాణమయ కోశమను అశ్వము యొక్క దేహముగా ధ్యానము చేయవలెను. దీనివలన సర్వజ్ఞత్వము, సకల బంధ విమోచనము కలుగును. దీనినే **హయగ్రీవ విద్య** అని కూడా అందురు.

దధీచి అను పదమునకు 'ధీ శక్తి' అని అర్థము. అనగా ధారణ చేయు శక్తి. ధారణచేయు శక్తి, బుద్ధిబలము, వివేకము కలసి వెన్నెముక యందు అంతట వ్యాపించి పనిచేయు చుండును. ఈ వెలుగునకు జీవులు చేయు కర్మతో సంబంధము లేదు. ధ్యానమార్గమున దీనిని ఆశ్రయించిన వారిని కర్మలు అంటవు. అట్లు ముక్తసంగులు అగుదురు.

నారాయణుడు తనను ధ్యానించుటలో నున్న విశేష మార్గమును ఇంద్రాది దేవతలకు భావగర్భితముగా తెలిపినాడు. నారాయణుడు చేసిన ఉపదేశము గ్రహించినచో ఇంద్రునికి వృత్రునికి బాధ వుండెడిది కాదు. అందువలన నారాయణుడు ఇంద్రునకు దధీచి నాశ్రయింపుమని హితము తెల్పెను. దధీచి అంతర్యామి విద్యను తెలిసినవాడు కనుక అతనివద్ద నున్న ఆ విద్యను గ్రహించమని బోధించెను. దధీచి శిరస్సు, వెన్నెముకల యందు వ్యాపించియున్న దేదీప్యమానమైన తన వెలుగును పొందు మార్గమును దధీచి తెలుపగలడని నారాయణుడి భావన. దీనిని పొందినచో ఇంద్రుని మనస్సు అనన్య మగును. అనగా అన్యములేక సమస్తమునందును నేను, తాను అను వెలుగే దర్శన మిచ్చును. అప్పుడు వృత్రు డుండడు. వృత్రుడు కూడ తానే యగును.

**ఇంద్రుని తిప్పలు :**

పై రహస్యమును తెలియక ఇంద్రుడు స్వీయ రక్షణార్థమై దేవతలందరితో కలసి దధీచి నాశ్రయించి అతని శిరస్సు, వెన్నెముకలను ఒక ఆయుధముగ మలచుకొనుటకు కోరిరి. తమ దేహముల రక్షణార్థము ఒక మహర్షి దేహమును కోరుటకు కూడ సంకోచింపని స్థితికి ఇంద్రుడు పతనము చెందెను. వివేకము భ్రష్టమైనపుడు, సంపాతములు పెక్కు విధములుగ వుండును కదా! ఇంద్రుడు బృహస్పతిని అవమానించెను. తత్ఫలితముల నుండి తనను

రక్షించుకొనుటకై బ్రహ్మను ప్రార్థించెను. బ్రహ్మదేవుడు విశ్వరూపుని ఆశ్రయించమని బోధించెను. విశ్వరూపుని ఆశ్రయించి మరల ఇంద్రపదవి పొందెను. అటుపై విశ్వరూపుని అవమానించుటయే గాక హత్య చేసెను. తత్ఫలితముగ మరల పదవీ భ్రష్టుడయ్యెను. బృహస్పతిని గాని, విశ్వరూపుని గాని అత డవగాహన చేసుకొనలేదు. నారాయణుని బోధన కూడ అవగాహన కాలేదు. దధీచి మహర్షి వెన్నెముకను కోరుటకు కూడ సంసిద్ధపడి సందేహింపక యాచించెను. ఇంద్రుని స్వార్థము ఉచ్చనీచములను మరచినది. అతని తెలివి లౌక్యముగ మారినది. అట్టి లౌక్యమునే అతడు దధీచిపై వినయ పూర్వకముగ ప్రయోగించెను. **వినయము లౌక్యమునకు పసిడి పూత.** అది లోదృష్టి కలవారిని ఆకర్షింపదు. ఆడంబరము కలవారిని ఆకర్షించును. వినయము భక్తితో జోడించినప్పుడు జీవి సంస్కారవంతు డగును. లౌక్యముతో జోడించినపుడు పతనము చెందును. ఇంద్రుని లౌక్యపూరిత ప్రార్థన విని దధీచి మహర్షి ఇట్లనెను.

## దధీచి బోధ :

"అంత వినయము, లౌక్యము అక్కరలేదు. మీరు చూపు లౌక్యము లన్నియు ఎరిగిన వాడనే! ఈ దేహము ఎప్పుడైనను విడువ వలసినదే కదా! దేవతా ప్రీతికై దీనిని సమర్పించుట కన్న కోరదగిన దేమున్నది. కార్యసాధన కీయబడినదే కదా దేహము! స్థిరముగ దీనిలో కాపుర ముండుట కెట్లును సాధ్యము కాదు. ఈ సత్యము గ్రహించినవాడు తెలివైనవాడు.

"ఈ దేహము తాత్కాలికముగ కార్యసాధనకై నిలుపబడినదే కాని స్థిరమనుకొని దానిలో కాపురముండుట సాధ్యము కాదు. ఇది తెలిసినవాడే తెలివైనవాడు. తనకు కీర్తిపై వ్యామోహ మున్నచో దేహమును పణముగా పెట్టి కీర్తిని సంపాదించువాడు ఇంకను తెలివైనవాడు. కీర్తిపై వ్యామోహము లేనిచో సత్కర్మలు చేసి శాశ్వతత్త్వమును పొందవలెను. ఎట్లైనను శరీరమును యిట్లు వినియోగించినవాడే బుద్ధిమంతుడు. తన కోసమే వినియోగించుకొనుట తక్కువ తెలివి. ఇతరుల శ్రేయస్సు కొఱకు వినియోగించుట నిజమైన తెలివి.

"మీరు పుణ్యాత్ములచే కూడ కీర్తింపబడు దేవతలు. మీరు నా శరీర భాగము (వెన్నెముక)ను కోరి వచ్చినారు. శరీరము పలుధర్మముల ఆచరణచేత ఆర్జించుకొన్నదే. ధర్మ స్వరూపులై దేవతలు ఈ శరీరమును సాధించి అందించిరి. వారికి శరీరము వినియోగపడినచో అంతకన్న అదృష్ట మేమి? నిజమున కీ దేహము అనుకూలము కానిచో కష్టములకు, నష్టములకు, నీచత్వమునకు, దీనత్వమునకు కూడ దారితీయగలదు. కుక్కలకు, నక్కలకు (అనగా నీచులకు) ఉపయోగపడుటకన్న, ఉత్తమ కార్యసాధనకు ఉపకరించినచో ఉత్తమము కదా! కావున మీకు సంతోషముగ ఈ దేహము నర్పించెదను. మీ ఇష్టఫల సిద్ధికి వినియోగించుకొనుడు." అని దధీచి మహర్షి పలికి ధ్యానమున ముహూర్త కాలమున నిశ్చలుడై నిలచెను.

బంధనములు తెగిపోయెను. తాను దేహబంధన విముక్తుడై తన దేహమను క్షేత్రమును ఒక్కసారిగ దర్శించెను. తాను పరమాత్మునియందు భాగముగ దర్శించి యోగస్థితి చెందగ దేహము పడిపోయెను.

ఇంద్రుడు విశ్వకర్మను రావించి దధీచి శరీరమునగల ఎముకలను కూర్పు చేయించి వజ్రాయుధమును నిర్మాణము చేయించెను. దానిని దాల్చి తేజోవంతుడై ఐరావతము నధిరోహించి తన సకల పరివారముతో వృత్రునిపై దాడిచేసెను.

**ఇంద్ర-వృత్రుల యుద్ధము :**

ఇంద్రుని సేనలకు, వృత్రుని సేనలకు భయంకరమైన యుద్ధము దీర్ఘకాలము జరిగినది. క్రమశః రాక్షసులకు పౌరుషము, పంతము తగ్గి అభిమానము వీడి పారిపోసాగిరి. దేవతలు విజయోత్సాహముతో మరింత పౌరుషముగ పోరాడుచు, విజయ చిహ్నములను దర్శించిరి.

అప్పుడు వృత్రుడు, తన సేనల పరిస్థితిని గమనించి, పకపక నవ్వి ఇట్లనెను : “మీరు శూరులు కదా! ఈ పిరికితనమేమి? చావునకు భయపడుచున్నారా? జబ్బు చేసినచో కూడ చచ్చిపోవుదురు కదా! అంతకన్న యుద్ధములో చచ్చుట మేలు కదా! యుద్ధమున చచ్చిన కీర్తి కలుగును. స్వర్గ భోగములు కలుగును. కావున చావు సమీపించిన సందర్భమున దానిని పణముగ పెట్టి కీర్తి, భోగములు

పొందుట తెలివి. పారిపోయి వృద్ధాప్యము చెంది, జబ్బుచే చనిపోయినచో ఏమియు లభింపదు. జీవితము ఒక ధర్మ యుద్ధముగ కొనవూపిరి వరకు పోరాడి మరణించినవారికి ఉత్తమ లోకములు తథ్యము. పిరికిపందలకు ఏదియు లభ్యము కాదు. పుట్టిన జీవికి చావు ఎట్లును నిశ్చయమే. చావతగిన విధమున చచ్చుట శ్రేయస్సుగాని మరియొక విధముగ చచ్చుట నీచము. చావ తగిన విధములు రెండే. అవి : 1. యుద్ధమున చచ్చుట, 2. యోగాభ్యాసమున చచ్చుట." (యోగాభ్యాసమున చచ్చుట యనగా అహంకారము చచ్చి జీవి దేవుడగుట. మిగిలిన చావులు చచ్చు చావులు.)

ఇట్లు వృత్రాసురుడు పలుకగా అసుర సేనలు గ్రహింపక పారిపోవుట చూచి యింకను ఇట్లనెను.

"మీకు స్వర్గ మక్కరలేదా! స్వర్గముపై కోరిక యున్నచో పురోగమింపుడు. మీ వెనుక నేను నిలబడి యున్నాను. నా దృష్టి స్పర్శ కలిగి మీరు బలముతో పురోగమింతురు గాక అని గర్జించెను. ప్రళయాగ్ని జ్వాలలను తిరస్కరించు చూపులతో శివునివలె భయంకర మూర్తిగ నిలబడి దేహము పెంచి దేవతలను మ్రింగుటకు పెద్ద నోరు తెరచి ఒక్కమారు విజృంభించి భుజములు చరచి భయంకర శబ్దము చేసెను.

ఆ శబ్దమునకు ఆకాశము బ్రద్దలయ్యెను. సూర్య చంద్రులు భయపడిరి. గ్రహములు, తారకలు కంపించినవి. దిక్కులు కదిలెను.

ఆ చర్యకు దిక్పాలకులు, దేవతలు, రుద్రులు, మరుత్తులు, అశ్వినులు మొదలుగా గల దేవసైనికు లందరును నిరాయుధు లయ్యిరి. వారి బాహువులు ఆయుధములను ధరించలేక పోయినవి. అందరును మూర్ఛిల్లిరి. మరల తెప్పరిల్లిరి. ఈ లోపున వృత్రుడు శూలము ధరించి దేవతల సైన్యముల వైపునకు వడివడిగ అడుగులు వేసెను.

**ఇంద్రుని ఓటమి :**

వృత్రాసురుడు అరివీర భయంకరుడై, శూలమును గిరగిర త్రిప్పుచూ, దేవతా సైన్యములను తరుముచూ, పాదముల క్రింద దేవతలను త్రొక్కుకొనుచు పోవుచుండెను. అతని పాదములు పడినచోట దేవతల రూపములు తొలగి మట్టిలో కలిసిపోవు చున్నవి. తిరుగులేని విధముగ వృత్రుడు ఇట్లు ఒక్కడై దేవతలను సంహరించుకొనుచు ఇంద్రుని సమీపమున కేగెను. ఇంద్రుడు నూరు వజ్రాయుధముల బలముగల తన గదను గిరగిర త్రిప్పి వృత్రునిపై విసిరెను. ఆ గద భయంకర తేజస్సుతో ఆకాశమున మంటలు క్రక్కుచు మహా వేగముతో సంహరించుటకై వృత్రుని చేరెను. వృత్రుడు నవ్వుచు ఆ గదను తన ఎడమచేతితో పట్టుకొనెను. దానిని తిరిగి ఇంద్రుని ఐరావతముపై ప్రయోగించెను. ఐరావతము తల పగిలి రక్తధారలు స్రవించుచుండగ తూలుచు పారిపోయెను. ఇంద్రుడు ఎంత అదలించినను, అంకుశముతో తోలినను ఐరావతము ముందుకు పోలేదు. అపుడింద్రుడు అమృతపానము చేసిన తన చేతితో ఐరావతము తల నిమిరెను. ఐరావతము సేద తీరెను.

ఐరావతముతో తిప్పలు పడుచున్న ఇంద్రుని వృత్రుడు సమీపించి చూచెను. తన సోదరుడైన విశ్వరూపుడు జ్ఞప్తికి వచ్చెను. కొంచెము దుఃఖము వచ్చెను. ఇంద్రునిచూచి మందహాసము చేసి ఇట్లు యుద్ధ సంభాషణము చేసెను.

**వృత్రుని దివ్య భాషణము :**

"విశ్వరూపుడు నా కన్నగారు, నీకు సద్గురువు. ఆశ్రయించిన వారిని రక్షించిన మహానుభావుడు. అత దందరికిని శుభమునే కోరును. అట్టివానిని చంపితివి కదా! నీవు పాపివి కాక దివ్యుడవు ఎట్లు కాగలవు? నీకు లోభబుద్ధి పోలేదు. నేడు నా బాహు బలమునకు గురి అయితివి. ఈ శూలము కంపించు రీతిగ నిన్ను గ్రుచ్చి గ్రుచ్చి అన్నగారి ఋణము తీర్చుకొందును."

"తన ప్రాణము రక్షించుకొనుటకు గురువు, చుట్టము, పుణ్యమూర్తి, నిర్దోషి అగు బ్రాహ్మణుని పశువువలె నరికి చంపిన నీచుడవు నీవొక్కడివే."

"దయ గాని, సత్యవాక్కు గాని, ధర్మము గాని, కీర్తికాంక్ష గాని, నీలో లేశమున్నను ఇట్టి హత్యకు పాల్పడెడి వాడవు కావు. ఇట్టి ప్రవర్తనగల నీకు సంపద ఎట్లు నిలుచును? పదవి ఎట్లుండును? జయము ఎట్లు కలుగును? శౌర్యము వీడి సందేహము లేక అట్టి నీచవృత్తికి పాల్పడితివి. నీబోటి వాడు మరణించినచో ధర్మాత్ము

లెవ్వరును బాధపడరు. కుక్కలు, నక్కలుకూడ నీ శవము నంటుకొనవు. చివరికి గ్రద్దలు, రాబందులు కూడ దగ్గరకు రావు. నా ఈ శూలము తాకుటచేత నక్కలు, కుక్కలు నీ మాంసమును నములునట్లు చేసినది. ఘోరకృత్యములు చేసినప్పుడు, నీ వెంట మహత్తరమైన పరివారమున్నది. నీవు చచ్చునపుడు నీ పరివారములో నొక్కడైన, నిన్నాదుకొనగలడా? ఎంత సంపద అయినను, బలగమున్నను తాను చేసినదే తనతో వచ్చును గాని, మిగిలినవి రక్షింపవు. నా శూలము నుండి పుట్టు మహాజ్వాల యందు నిన్నొక పశువుగా, నీ పరివారమును మేకలుగా హోమము చేసెదను.”

12

.................................................................................

# వృత్రుని ఉపదేశము

"ఇంద్రా! నీవే నీ వజ్రాయుధముతో నన్ను చంప గలిగితివేని, ఈ పంచభూతములలో కలిసి ధన్యత చెందెదను. ఓ ఇంద్రా! సందేహింపక నీ వజ్రాయుధమును ప్రయోగించుము. లోభిని యాచించిన డబ్బువలె నీ వజ్రము ముందునకు రాదు. పనిచేయదు. నీవు ధరించుటచే వజ్రము, వజ్రముకాక యున్నది. అందు నారాయణ తేజమున్నది. దధీచి తేజస్సు కూడ దాని యందున్నది. శ్రీమన్నారాయణుని ఆజ్ఞను పొంది వజ్రమును ప్రయోగించినచో శత్రువులను గెలువగలవు. అంతర్యామి భావన ఎందుండునో అందు నారాయణు డుండును. విజయము, సంపద అచ్చటనే యుండును. అతని పాదముల యందు మనస్సు నిలుపగలిగినచో జయము పొందగలవు. నీ చేతియందున్న వజ్రము, నీది కాకపోయినపుడు పనిచేయును. చేతనైనచో అట్లు ప్రయోగింపుము. అపుడు మాత్రమే నీవు నన్ను జయించగలవు. అపుడు నేను దేహము తొలగినవాడనై ఈశ్వరుని హృదయము చేరుదును. **అహంకారివి. నీకీ రహస్యము బోధపడదు.** బృహస్పతి అందించిన బుద్ధి, అహంకారివై బుగ్గి

చేసుకొంటివి. బ్రహ్మదేవుడు అందించిన సాధనా రహస్యము నీ కవగతము కాలేదు. విశ్వరూపుని అంతర్యామిత్వము మదించిన నీకు మరుగైనది. శ్రీమహావిష్ణువే సూక్ష్మముగ తెలిపిన దధీచి వెన్నెముక రహస్యము అందుకొనుటకు మరల నీ అహంకారమే అడ్డు వచ్చినది. నే నుపదేశించు భాగవత ధర్మమును వినుము."

వృత్రుడు యింకను ఇట్లు పలికెను : "నేను నారాయణు నకు దాసుడను. కనుక నరలోకము, స్వర్గము, పాతాళము అని నాకు లేవు. ఏ లోకపు సంపదలును నన్నాకర్షింపవు. ధర్మార్థ కామముల వుక్కిరి బిక్కిరి లేనట్టి మహదానందమును, నారాయణ లోకము ప్రసాదించును. నారాయణుని పాదమే నాకు మూలము. అతని దాసులకు నేను దాసుడను."

## వృత్రుని ప్రార్థన :

ఇట్లు ఇంద్రునితో సంభాషించుచు వృత్రుడు, విష్ణుని యందు తన్మయత్వము కలవాడై ఇట్లు ప్రార్థించెను. "నీ గుణములన్నియు భక్తులను రక్షించునట్టివే. అట్టి నిన్ను స్మరించి ఆత్మస్మరణ స్థితిని పొందెదను. ఇతరులలో నిన్ను చూచి స్తుతించుచు ఈ దేహమంతయు దాస భావము పొందుటకు కోరుకొందును. అంతేకాని నీవు నన్ను ధ్రువుని తలపై నిలుపుదు నన్నను, ఇంద్ర పట్టణమున స్థాపింతు

నన్నును, బ్రహ్మ బదులుగ, సృష్టికర్తగ నిలుపుదు నన్నును నా మనస్సున కాకర్షణ లేదు.

"ఆకలి పొందిన లేగలు తల్లి దగ్గరకు పరుగెత్తును. రెక్కలు రాని పిట్టలు తల్లి రాకకు ఎదురు చూచు చుండును. కుఱ్ఱ వయస్సున ఆడుది తన భర్త దూరదేశ మేగి తిరిగివచ్చుట కాలస్యమైనచో తహతహ లాడిపోవును. ఇట్లు ఏ విధముగ నైనను నా మనస్సు నీ వైపునకే పరుగెత్తును కాని మరియొక దిక్కని యున్నదా? మహనీయులతో నాకు సాంగత్యము కల్పింపుము. లోక సుఖములకై తహతహలాడు జన్మము కలుగకుండ అనుగ్రహింపుము."

ఇట్లు వృత్రాసురుడు సర్వాంతర్యామియైన దైవముపై మనస్సు నిలిపెను. దేహము ఆనందముతో ఉప్పొంగెను. జయము, చావు అను భేదము అతనికి లేకున్నది. ఆ స్థితిలో తన కర్తవ్యముగ శూలమును ఇంద్రునిపై విసిరెను. కోటి సూర్యుల కాంతితో ఆకాశము ప్రకాశించి అది ఇంద్రుని చేరెను. దాని నింద్రుడు వజ్రాయుధముచే ఖండించెను. దేవత లాశ్చర్యపడిరి. వజ్రము పనిచేయుటకు వృత్రుడు ఇంద్రునికి చేసిన ఉపదేశమే కారణమని దేవతలు గ్రహించి ఆశ్చర్యపడిరి. వృత్రుని జనన మరణాతీత స్థితిని తెలుసుకొని నివ్వెరపోయిరి. నారాయణుని స్మరణము చేతనే వజ్రము పనిచేయునని, అతని ఆజ్ఞ చేతనే వజ్రముతో శత్రువులను గెలుచుట వీలుపడునని అతని పాదముల యందు మనస్సు నిల్పగలిగినచో నిలుపుమని వృత్రుడు ఇంద్రునికి తెలిపెను.

నారాయణుడి ఆజ్ఞకు మాత్రమే తాను దాసుడనని కూడ తెలిపెను. నారాయణునికి సమర్పణము చెందిన వృత్రుని శూలమును వజ్రము ఖండించుట నారాయణుని పనియే. ఇంద్రుడు వృత్రుడందించిన నారాయణోపాసనా రహస్యమును గ్రహించి, నారాయణ స్మరణమున నిలిచి వజ్రమును ప్రయోగించుటచే, ఆ వజ్రము వృత్రుని శూలమును ఖండించెను. అంతియేకాక వృత్రుని భుజమును కూడ ఖండించెను. ఈ రహస్యమును చూచి దేవత లాశ్చర్యపడిరి.

## వృత్రుని బలము; ధర్మము :

కర్తవ్య ముఖముగ వృత్రుడు యుద్ధము కొనసాగించెను. పరిఘము అన్న ఆయుధమును గిరగిర త్రిప్పుచు ఇంద్రుని ముట్టెపై భరింపరాని బాధ కలుగునట్లు మొత్తెను. ఐరావతము యొక్క కుంభస్థలము బ్రద్దలుకొట్టెను. ఏనుగు గిరగిర తిరిగి ఘీంకారము చేయుచు పారిపోయెను. ఇంద్రుడు భయపడి వజ్రాయుధమును, భూమిపై విడచెను. దేవతలందరును భయపడిరి. అనగా ఇంద్రుడు నారాయణ స్మరణ నుండి దిగజారి భయమున నిలచెను. అదిచూచి దేవతలు భయపడిరి.

గరుత్మంతుడు దండెత్తి వచ్చినప్పుడు సర్పము లెట్లు భయపడునో అట్లు దేవత లందరును దిగులుపడిరి. మూడు లోకముల వారును, వృత్రాసురుని శౌర్యమునకు ఆహా! యని

పొగడిరి. ఐరావతము దెబ్బతినగ, వజ్రమును చేజార్చుకొని ఇంద్రుడు దీనస్థితిని పొందగ అవకాశము తీసుకొనక, వృత్రుడు వేచి చూచుచుండెను. తన శత్రువునకు గల యుద్ధ ధర్మమును చూచి ఇంద్రుడు సిగ్గుపడి తల వంచుకొనెను. తాను ప్రాణభీతితో గురువైన విశ్వరూపుని తలలు నరికినవాడు. తన శత్రువు యుద్ధమున ఆయుధము చేజారిన తనను చంపని ఉత్తమ యుద్ధ ధర్మ మెరిగినవాడు. అందుచే ఇంద్రుడు లజ్జపడి తల వంచుకొనెను. చేజారిన వజ్రమును మరల అందుకొనుటకు శత్రువు అవకాశ మిచ్చినను అట్లు చేయక నిలబడెను. వానిని చూచి వృత్రు డిట్లనెను.

"యుద్ధమున శత్రువు ఆయుధము విడచినను, శరణన్నను, వీరులు చంపరు. భయపడకుము. నీవు వంగి వజ్రాయుధమును స్వీకరించవచ్చును. ఇంతలో నిన్ను చంపబోను. వజ్రమును స్వీకరించి శత్రువును జయింపుము. భయపడుటకు నీకిది సమయము కాదు.

వజ్రము చేజారి ఇంద్రుడు సిగ్గుపడి తలవంచి నిలబడెను. వృత్రుడు అభయమిచ్చి వజ్రము నందుకొనమనెను! వజ్రమును స్వీకరించి శత్రువును జయింపు మనెను!! వృత్రుడు శత్రువును జయింపుమని చెప్పుటలో రహస్యార్థము కలదు. వృత్రున కింద్రుడు శత్రువు కాదు. అతనికి ఇంద్రుడు కూడ నారాయణ రూపమే. కాని ఇంద్రునకు వృత్రుడు శత్రువు. అనగా ఇంద్రుని భావమున వృత్రుడు శత్రువుగ వున్నాడు. విశ్వరూపుని కూడ ఇంద్రుడట్లే భావనచేసి

పాపమున పడెను. ఇట్లు ఇంద్రు డెప్పుడును శత్రువులచే త్రిప్పలు పడుచు నుండును. (ఇంద్రుడనగా మనస్సే. మనస్సునందు మిత్రత్వము, శత్రుత్వము అను ద్వంద్వము లుండుట సహజము. బుద్ధియందు ఈ ద్వంద్వము లుండవు. బుద్ధియందు సమత్వమే యుండును. మనస్సుతో శత్రువును జయించుటకు పడు తిప్పలే ఇంద్రుడు పడుచున్న తిప్పలు. వృత్రుడు ఇంద్రుని దీనస్థితిని చూచి ముందు తెలిపిన భాగవత ధర్మముతో పాటు ఇంద్రున కిట్లు బుద్ధిని కూడ ప్రసాదించెను.

నీవు భయపడుట కిది సమయము కాదని భయపడిన ఇంద్రునకు మరియొక నుపదేశము చేసెను. మనస్సుతో శత్రువును సృష్టించుకొన్నవారు వారితో యుద్ధము చేయుచు మధ్యలో జారిపోవుట తగదు. అట్లు చేసిన లౌకిక లోకములలో అపకీర్తి, చావునకు భయపడుట వలన పతనము తప్పవు. కావున జంకక నిలిచి పోరాడుమని, గెలిచినచో కీర్తి, సంపద దక్కునని, ఓడి మరణించినచో ఉత్తమ గతులు దక్కునని వృత్రుడు బోధించెను.)

వృత్రుడు మరియొక ఉపదేశమును కూడ ఈ విధముగ చేసెను. "సమస్త జీవరాసులకును దేహాకారములను అందించువారు దేవతలు. అట్టి దేవత లందరికిని, ఈశ్వరుడే ఆధారము. అత డంతర్యామి. అతనిని మరచినచో దేవతలకైన విజయము కలుగదు. నీవు దేవేంద్రుడ వైనప్పటికిని, అంతర్యామి యగు నారాయణుని

మరచుటచే ఇన్ని తిప్పలు పడుచున్నావు. జీవులు మిముబోండ్ల దేవతల సహకారము లేనిదే ఏమియును చేయలేరు. మీ సహకారముననే వానికి దేహములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవి ఏర్పడుచున్నవి. కానీ మీరుకూడ అంతర్యామి యందు ఏర్పడుచున్న ఆకారములే. నీవిది గమనింపక అంతర్యామిని మరచితివి. బృహస్పతియందు, విశ్వరూపునియందు, ఇట్లంతర్యామిని గ్రహింపక దుష్ప్రవర్తన గావించితివి. నీవే సమస్తమునకు అధినాయకుడ వనుకొను చుంటివి కాని నీ కాధారమైన వానిని మరచితివి. అట్లు మరచుటయే మృత్యువు. ఎవడెన్ని చేష్టలు చేయుచున్నప్పటికిని అవి అన్నియు అంతర్యామి యందే. ఆ చేష్టల కాధారము కూడ అంతర్యామియే.

"సముద్రమున పడవ తేలుట పడవ గొప్పతనము కాదు. పడవ కదలిక కూడ పడవది కాదు. అట్లే జీవులును. ఈ జీవుల సృష్టి మొత్తము అంతర్యామియొక్క అల్లిక పని. పనివాడు తన పనిని గమనించుచున్నట్లే, ఈ సృష్టి మొత్తమును అతని, పద్మ దళములవలె విచ్చుకొనిన కన్నులతో గమనించు చుండును.

"పంచభూతములచేత వేరైన మాత్రమున, పురుషుడు వేరగునా? రెండు మంచుగడ్డలు నీటిలో తేలుచున్నంత మాత్రమున అవి రెండు నీళ్ళు కావు కదా! ఒకే నీరు ఎన్నియో మంచుగడ్డలు అగుచున్నవి కదా! అంతియే కాదు. ఒకే నీరు ఎన్నియో నదు లగుచున్నవి. సముద్రము లగుచున్నవి. తటాకములు, బావులు అగుచున్నది. ఇవి అన్నియు వేర్వేరుగ గోచరించినప్పటికి నీరు

ఒక్కటియే! అట్లే పంచభూతములచేత వేరు చేయబడిన జీవులు ఒకే పురుషుని రూపమును, తాను వేరనుకొనుట, జీవుని భావన మాత్రమే. తన భావముచే తాను వేరగుచున్నాడు కాని, నిజమున కతడు అంతర్యామి వ్యక్తరూపమే. భావము త్రిగుణాత్మక స్థితి. ప్రకృతి సహజముగ సృష్టియందు త్రిగుణాత్మకమైన ఇట్టి భావము ఏర్పడు చుండును. ఇది కారణముగ తానొకడు ప్రత్యేకముగ నున్నాడని, స్వతంత్రుడనని జీవు డజ్ఞానమున పడును.

"ఇట్లజ్ఞానమున పడిన జీవునకు త్రిగుణములు తన ప్రవర్తనకు కారణ మగుచుండును. త్రిగుణముల జిక్కిన జీవుడు కొంత కరుడు గట్టును. ఈ గుణములతో కూడి మనస్సు ఇంద్రియములను వినియోగించి నప్పుడు, మరింత కరుడు గట్టును. అనగా మనస్సు, ఇంద్రియములందు చిక్కును. దేహము మనస్సు, ఇంద్రియములను అనుసరించుటచే పూర్తిగ చిక్కును."

వృత్రుడు ఇంద్రునకు యింకను ఇట్లు చెప్పసాగెను. "ఇట్లు త్రిగుణముల చేతను, మనస్సు ఇంద్రియముల చేతను, దేహము చేతను చిక్కుపడిన జీవుడు, మూడుమార్లు చిక్కుబడుటచే, జీవుని త్రిధాబద్ధుడు అందురు. ఇవియే త్రిపురములు. ఈ బంధచ్ఛేదనము కలుగవలె నన్నచో జీవుడు తన నిజస్థితిని మరల మరల గుర్తుకు తెచ్చుకొనుచుండ వలెను. అంతర్యామి ధ్యానమున మాత్రమే త్రిపురములు నశించుట, త్రిబంధచ్ఛేదనము కలుగుట జరుగును."

## జ్ఞానోదయము :

వృత్రాసురుని అద్భుతమైన, దివ్యమైన బోధన విని ఇంద్రుడు మొదట ఆశ్చర్యపడెను. అటుపై బోధన కాకర్షితు డయ్యెను. అతనియందలి అజ్ఞాన మంతయు కరగిపోయెను. సాక్షాత్తు అంతర్యామియే వృత్రాసురునిగ తన నుద్ధరించు చున్నాడను సత్యము తెలిసెను. వృత్రాసురునే దైవముగా చూచెను. వృత్రాసురుని ఆజ్ఞ ప్రకారము క్రిందపడిన వజ్రాయుధమును తీసి పట్టుకొనెను. అప్పుడొక మహాద్భుతము జరిగెను. ఇంద్రుడు తనయందు సమస్త లోకములను దర్శించెను. అనగా ఇంద్రుడు కరగి అంతర్యామి యందు నిలువగ సర్వాంతర్యామియగు నారాయణుడే తానుగ నిలచెను. ఇంద్రుడు వేరుగ నున్నాడని మరచెను. నారాయణుడే తానుగ నున్నాడని దర్శించెను. అట్టి నారాయణ మూర్తిని గాంచి దేవత లందరును సంతోషించిరి. ఇట్లు తన అహంకారము పొర మరుగున పడుటయే వృత్రుడు అదృశ్యమగుట లేక వధింపబడుట. అపుడు ఇంద్రుడు గంభీరముగ ఇట్లు పలికెను. మొట్టమొదటిసారిగ వృత్రుని "దానవేంద్ర!" అని సంబోధించెను. అనగా అతడు తనతో సరిసమానమైన తేజస్సు కలవాడనియు, పరిపూర్ణ నారాయణ స్వరూప మనియు అంగీకరించెను. ఇట్లని పలికెను. "ఓ దానవేంద్ర! నీవు జ్ఞాన తేజస్సుగ వెలుగొందుచున్నావు. నీవు నారాయణునకు అతీతుడవైన భక్తుడవు. నీవు నారాయణుని మాయా లక్షణమును దాటి అఖండత్వము

పొందితివి. ఎట్టి తపస్సు చేసితివో కదా! ఏ నియమములను పాటించితివో!! చిత్రకేతు మహారాజుగ, నీ మనస్సు రజోగుణ ప్రధానమై యుండెడిది. శమదమాది గుణములతో అకుంఠిత దీక్షతో నీవు నారాయణుని పాద పద్మములను చేరుటయేకాక, నారాయణుని స్వరూపముగా నేర్పడితివి. నారాయణ రూపానుభవము అను అమృత సముద్రమున మునిగితేలుట నీ కభ్యాసమైనది. నీకు ఎట్టి పతనము లేదు. నీవు పరమహంస స్వరూపుడవు. సాక్షాత్తు నారాయణుడవే. నీ వందులకే నిస్సహాయుడనైన నన్ను సంహరింపక జ్ఞానబోధ చేసితివి. నీ జ్ఞాన మపారము. నీ కరుణ అనంతమైనది. నీవంటి ఉత్తమోత్తమ చైతన్య స్వరూపుడు పంది ముట్టెచేత త్రవ్వబడిన బురద గుంటలలో విహరించుటకు సమ్మతించునా? నాకు సద్బుద్ధిని ప్రసాదించుటకే నీ వవతరించితివి. ఇక నీకీ రాక్షస రూపము తగదు. విష్ణు మాయా లక్షణముల దాటి అఖండ స్థితిని పొందిన నీవు, విష్ణు రూపముననే యుండుము.

ఇట్లు పలుకుతున్న ఇంద్రుని చూచి, వృత్రుడు అతనిని యుద్ధమునకై పురికొల్పెను. తొందర పెట్టుచున్న మనస్సుతో ముందున కురికెను. అతడట్లు తొందర పెట్టుట వజ్రాయుధ స్పర్శకే. ఇంద్రుని వజ్రాయుధ ఘాతమున వృత్రుడు అంతర్యామిత్వము నొందెను. నారాయణ తేజమై విష్ణురూపము ధరించెను.

**ఫలశ్రుతి :**

చిత్రకేతు మహారాజు ఈ విధముగ విష్ణుత్వము చెందిన వృత్తాంత మంతయు భాగవత మార్గము. భక్తి శ్రద్ధలతో ఈ కథను పఠించి, అందు సాధనపరమైన బోధనలను ఆచరించి విష్ణుపథము చేరుటయే పాఠకుని కర్తవ్యము. ఇందు ఒక సామాన్యమైన సంసారిక జీవిగ మొదట చిత్రకేతువు దర్శన మిచ్చెను. అతడును మనవలెనే తీవ్రమైన శోక మోహమునకు లోబడి యున్నవాడే. అటుపై అంగిరస మహర్షి బోధనలు, నారద మహర్షి ఉపదేశము అతనిని భాగవత మార్గమున నిలిపి అనంత దర్శనమునకు దారితీసినవి. అనంతుని ఉపదేశమున సమస్త విద్యలను తనయందు దర్శించి ధరించుటచే అతడు విద్యాధరు డయ్యెను. విష్ణువునకు పరమభక్తుడై నిలచెను. అటుపై పార్వతీదేవి శాపమునకు గురియై తమోగుణ ప్రధానమైన తపః ఫలితముల నుండి రక్షింపబడెను. విష్ణుభక్తి కారణముగ జగత్కళ్యాణముగ ఇంద్రుని కూడ నుద్ధరించెను. శివునిచే ప్రశంసింప బడెను. చిత్రకేతువు భగవంతుని చేరిన ఈ కథ పాఠకులకు సత్ప్రేరణ కలిగించి సత్సాధనకు సత్ప్రేరణ యిచ్చినచో ఈ ప్రయత్నము సఫలము.

శుభమ్.